# పిల్లన గ్రోవి పిలుపులు

(లలిత గీతాలు)





పి. దుర్గారావు,
యం.బి.యల్.

ముప్పదియొకటవ పూజా పుష్పము

# పిల్లనగ్రోవి పిలుపులు

(లలిత గీతాలు)



రచన:

పి. దుర్గారావు యం.ఓ.యల్.

ప్రథమ ముద్రణము :
500 ప్రతులు



శ్రీముఖ నామసంవత్సరము
శరదృతువు-ఆశ్వయుజము
1993-అక్టోబర్

వెల : రు. **10-00**

ముఖచిత్రం :
చలం

ముద్రణము :
దుర్గాభవానీ ప్రింటర్సు, విజయవాడ-3

---

ప్రతులకు :
పి. దుర్గారావు, యం.ఓ.యల్.,
చెఱుకుపల్లి పోస్టు [వయా] నక్రేకల్,
నల్లగొండజిల్లా.

# సమర్పణ

ఎన్ని మారులు పాడినా
వన్నె తరుగదు నీ పాటకు!
ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!
మఱచి పోవాలన్నా మాధవా!
మఱపురాదు నీ పేరు!
విడిచి పోవాలన్నా వీడిపోదు
విడివడని బంధమిది యేనాటిదో!
తీయని నీ మురళీ పాట
తీపివిసం కురిపిస్తుందెప్పుడూ!
నర్తన జేస్తుందెప్పుడూ నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!
అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆవేదనతో నా మధుర గీతాలను!
యుగయుగాల నాటి నీ మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయావేదన!

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సుభాషిణీ!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున కృష్ణవేణి-కావేరి తుంగభద్ర!
ఉన్నత హిమగిరిశిఖరము-లొప్పెడు శుభ కల్యాణి!
అడుగడుగున పుణ్యభూము-లమరు విమల సౌమ్యమూ
మధుర కావ్యగేయ శిల్ప-మంజుల తర శివగాయిని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశిస్సులు సలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!

# వినయ వాక్యము

'పిల్లనగ్రోవి పిలుపులు' అను ఈ లలిత గీతాల పుస్తకమును ముప్పది యొకటవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణారవిందములకు భక్తిపూర్వకముగా సమర్పించుకొనుచున్నాను.

ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొనుచు నప్పుడప్పుడు వ్రాసికొనినవి యీ గీతములు. మధురభక్తిని మనోహరముగా వ్రాసికొనిన మహా భక్తురాలు మీరాబాయి, కీ. శే. దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారి మధుర గీతములే నా యీ లలిత గీతములకు ప్రేరణ యని చెప్పవచ్చును.

శ్రీకృష్ణుని నాయకునిగా జేసికొని మధుర భక్తితో రచించిన ఈ పుస్తకమును శ్రీకృష్ణుని చరణారవిందములకే సమర్పణము గావించుకొనుచున్నాను.

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు (మురళీ లోలుడేగాక) పరబ్రహ్మ స్వరూపముగాను; ఇందలి గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు వేదనాపూరితమైన జీవి ప్రార్థనగా భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలిత గీతములను ప్రశంసించుచూ పత్రికలు, ప్రముఖులు వ్రాసియున్నారు. వారికి నా నమస్సుమాంజలులు! ఇదే విధముగా మఱి కొన్ని పుస్తకములు ప్రచురింపవలెనని నా ఆకాంక్ష.

నేనొక కవిగా గాని, రచయితగాగాని భావించుట లేదు. కొంత కాలము ఉత్తమ ముద్రాక్షర శాలలయందు పని

చేయుట చేతను, మహనీయులయిన మహాకవులు, రచయితల యొద్ద భక్తితో మెలగుట చేతను, కొన్ని సాహితీ గ్రంథము లను పఠించుట చేతను నాకీ స్వల్పమైన రచనా నైపుణ్య మలవడినదని భావించుచున్నాను.

ఈ పుస్తకమునందుగల 88 గీతములు సాధ్యమై నంతవఱకు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుది గ్రుచ్చబడినవి. రసహృదయుల నేమాత్రము స్పందింప జేసినను ధన్యునిగా భావించుకొందును.

—రచయిత



# పల్లె సద్గోపి పల్లవులు

(లలిత గీతాలు)

కొండ కోనల్లోని కోకిలా పాడింది!
నా మనసు పులకించి నవగీత మొలికింది!
నీ మురళి స్వనములను నీటుగా మాధవా!
నవభావములతోని నర్తనలు జేసింది!
కొండకోనల్లోని కోకిలా పాడింది!
నా మనసు పులకించి నవగీత మొలికింది!

వన్నెలను దాల్చినా
చిన్ని చిగురాకులా!
కన్నె మనసుకు మల్లె కలతబడసాగింది!

చల్లగాలికి కదిలి
మెల్లగా వికసించు!
మల్లెపూవుకు మల్లె మనసు విప్పారింది!

పూదేనియల నొలికి
పుప్పొడులు జిందేటి
వనలతకు వలె మనసు వయ్యార మొలికింది!

పండు వెన్నెలయందు
పరవశము నొందాను!
కొంత కోర్కెను దీర్చి కనికరము జూపుమా!
కొండ కోనల్లోని కోకిలా పాడింది!
నా మనసు పులకించి నవగీత మొలికింది!

# చిన్నికృష్ణుని మురళి

చిన్నికృష్ణుని మురళి సన్ననీ ధ్వనులవే!
నే నిలువలేనమ్మ! నే నిలువలేనే!

కొండ శిఖరము నెక్కి కోవెలను నే జేరి
పాట వినుదును సఖీ! పారవశ్యము జెంది!

చిన్నికృష్ణుని మురళి సన్ననీ ధ్వనులవే
నే నిలువ లేనమ్మ! నే నిలువలేనే!

జల జలా పారేటి సెలయేటి తరగలా
నా మదిని సాగింది సవభావ జలధార!
ఆగలేనే మదిని యలల తరగల సుడుల
చిన్నికృష్ణుని దాపు చేరు సందాకనూ!

నాలోని చైతన్యమది యేమి చిత్రమో!
అతనిపై ప్రేమ లాగు యాత్మీయతను దెలుపు!
జన్మ జన్మల చిత్ర బంధమది కామోను
అన్ని వదులుదు గాని యతని నే వదలనే!

విమలమగు శ్రీ మురళి యమలమగు స్వనములను
నా మనసు హంసయై యంబరమునం దేలరు!
అఖిల జీవుల నిలుచు నాత్మ యొకటయినటుల
విశ్వమంతా నాకు వేణుగానము తోచు!

చిన్నికృష్ణుని మురళి వన్నెలా ధ్వనులవే!
నే నిలువలేనమ్మ! నే నిలువలేనే!

## విశ్వ మోహనమైన

విశ్వమోహనమైన విమలమౌ నీ మురళి
నిఖిలమంతా కృష్ణ! నిలయమైనది గాద!

అణువణువు విలసిల్లి యవని యంబరమంత
గ్రహతారకల యందు గలిసి యున్నదిగాద!

విశ్వమోహనమైన విమలమౌ నీ మురళి
నిఖిలమంతా కృష్ణ! నిలయమైనది గాద!

సర్వమానవ కోటి
సరసత్వమును గూర్చి
పయనింప జేసేటి ప్రగతి పథముగ పోయి!

విశ్వ సౌందర్యమును
నిస్వనములను నిలిపి!
ఆత్మేశ్వరుని జూడ నాధారమైనదీ!

పతితులను దరిజేర్చి
వెతల నల పొలిగించి
తీయనీ జీవితము తీరమును జేర్చుగద!

ప్రేమ దయ కరుణలను
ప్రీతిపాత్రుల జేసి
మానవత్వ మనేటి మమత గలిగించునది!

ఆటపాటల నేర్పి యలరించునది గాద!
సాహిత్యమును బొంద సాధనంబది గాద!
విశ్వమోహనమైన విమలమౌ నీ మురళి
నిఖిలమంతా కృష్ణ! నిలయమైనది గాద!

# ఆపజాలని ప్రేమ

ఆపజాలని ప్రేమ నందింపబోకుమా!
మురళినూదుచు నన్ను మోహమున ముంచి!
ఇందందు గలవాన పందులోదును కృష్ణ!
సందేహములు లేవు సరిలాత్మకుండవూ!
ఆపజాలని ప్రేమ నందింపబోకుమా!
మురళి నూదుచు నన్ను మోహమున ముంచి!

విరహ జ్వాలల చురుకు
విచ్చు కత్తుల పైని
పదములుంచీ నేను పయనించలేనోయి!
భరియించలేను నీ
భ్రమర గీతములు నను
అగ్నిగుండాలుగా సలపి మంటించెను!

మంద మారుతమందు
మధుర గీతములందు!
విరిసినా వెన్నెలల తరులందు లతలందు
వినిపించు నీ మురళి
వేయి రవములతోని!
అమ్మా! నీ మురళి మోపజాలని ప్రేమ!

ఆపజాలని ప్రేమ నందింపబోకుమా!
మురళి నూదుచు నన్ను మోహమున ముంచి!

పిల్లి న గ్రోపి

## మందారములు మొలిచె

మందారములు మొలిచె అందముగ తూర్పునా
సిందూరములు విరిసి చీకటులు తొలిగే!

అందముగ గగనాన సుందరుడు మాధవుడు
మురళీ స్వనాలనూ మోదముగ నూదెనూ!

మందారములు మొలిచె అందముగ తూర్పుదెస
సిందూరములు విరిసి చీకటులు తొలిగే

కలలన్ని చెదిరినవి
కాంతి చక్రము తొలికి
జగమంత చైతన్య జాగృతులు విరిసినవి!

పూచినవి పూవులూ
పులకించె సంజలూ!
జీవిలోనున్నట్టి దివ్యకిరణము కదిలె!

మనిషిలో నున్నట్టి
మానవత్వము విరిసి
పద్మముగ భాసిల్లె భాస్కరుని కాంతిగా

నా చిన్ని కృష్ణునీ
నాదమున యేముందొ
సుందరంబయి జగతి శోభలను గూర్చినది!

మందారములు మొలిచె నందముగ తూర్పునా
సిందూరములు విరిసి చీకటులు తొలిగే!

## అందుకే గద స్వామీ!

అందుకే గద స్వామి! యలరి నిను గోరినది!
అంజలిని గాదనీ! యాశలను వదిలీ!
నీ మురళి ధ్వనులకే నే దాసినయిపోతి
నీ రాగ ధ్వనులకే నేను బందీ నయితి!
అందుకే గద స్వామి! యలరి నిను గోరినది!
అంజలిని గాదనీ! యాశలను వదిలీ!

నీ మురళి నేముందో! నీ ధ్వనుల నేముందో!
మంచువలె కరిగి నే మధురవాహిని నయితి!
కొండ కోనలయందు గుడులందు గుహలందు!
శిలలలో శిలగ నే శిల్పముగ మారితిని!

రంగురంగుల జిందు రమణీయ మూర్తినయి
గుహలోని యందాల కూర్మి చిత్రమునయితి!
సంగీత ధ్వనులతో సరిగమలనయిపోతి!
నాట్యాల బొమ్మనయి రవ రవలు జేసితిని!

కమనీయ కవితతో గానమును జేసితిని!
లలిత విద్యలనేర్చి లావణ్యనయితినీ!
అందాలకృష్ణ నీ యాలాపనల మహిమ!
ఇన్ని నేర్చిన దాని నింకేల సైకొనవు?

అందుకేగాద స్వామి! యలరి నిను గోరినది!
అంజలిని గాదనీ ! యాశలను వదిలీ!

# నిలువలేనే చెలీ!

నిలువలేనే చెలీ! నిలుపోపలేనే!
చిన్నికృష్ణుని మురళి చిద్విలాసాలకూ!
ఎంత చెప్పినగాని వేడుకున్నాగాని
నా మనసు వినదుగా నాతి! యేమందునే!
నిలువలేనే చెలీ! నిలుపోపలేనే!
చిన్నికృష్ణుని మురళి చిద్విలాసాలకూ!

మలి సంజకెంపులూ మాటు మణిగేవేళ!
మసక చీకటులూగి మూసుకొచ్చే వేళ
దూరాన వనవీధి దొలుకు మురళీ ధ్వనులు!
మఱతునే యో చెలీ! మాయలోకము నంత!

అర్ధరాత్రమునందు నలస నిదురను నుండ
కొండ కోనలయందు కోకిలలు బాడగా!
పిల్లనాగ్రోవి యా పిలుపులని భ్రమియింతు
పరువులెత్తుదు సఖీ! పరవశము జెందుచూ!

పాటలో ఆటలో బలుకులో జగమంత
ఆ మురళి వినిపించు నందాల స్వనములను!
నాదమున నే దగిలి నలిగి పోవుచునుంటి!
బంగారు మురళికీ బానిసను నైతినే!
నిలువలేనే! చెలీ! నిలుపోపలేనే
చిన్నికృష్ణుని మురళి చిద్విలాసాలకూ!

# మధురమైన నీ మురళీ స్వనములు

మధురమైన నీ మురళీ స్వనములు
మఱల మఱల వినిపించుటెందుకో!
మధుర మూర్ఛనల మాధుర్యములో
మై మఱపించుట యెందులకో! కృష్ణ!
మధురమైన నీ మురళీ స్వనములు
మఱల మఱల వినిపించుటెందుకో!

నింగి తారకల మిల మిల నుండీ
నిలిచిన జాబిలి రేకలనుండీ
నీలిమబ్బులా యంచులనుండీ
నీ మురళీ స్వనములనే విందును!
కొండల కోనల కొలనులందునా
చివురుల పూవుల చెట్ల నీడలను!
జల జల పారే ఝరులయందు నీ
పిల్లనగ్రోవి పిలుపుల విందును!
సుందరమైనా చోద్యములను గన
సదనమైన యే సంగీతము విన
ఎన్నినాళ్ళవో విమలమైన యా
సన్నివేశముల దలపున మెదులును!
ఎందుకిటుల నను వ్యథలో ముంచెదు!
పాలికాతిపై బరువు లెందుకో!
గాలికి కదిలే దీపములా యిటు
కలత బఱచుటేది కనికరమా కృష్ణ!

## అందాల నా మనస!

అందాల నా మనస! యపురూప కల్పమా!
చిన్నికృష్ణుని పైని చివురింపు గీతి!
మధురాక్షరములతో మాధుర్యముల నొలికి
తీయనీ పదములను దీపి తెనుగున బాడు!
అందాల నా మనస! యపురూప కల్పమా!
చిన్నికృష్ణుని పైని చివురింపు గీతి

అరవిందములు విరిసి యలరేటి కొలనులా
కొండ కోనలలోని కోయిలల పాటగా!
నవభావములతోని నవ్య సుందరములను
జతచేసి పాడుమా! చలియింప శిలలునూ!

నీ తోని గొనిపొమ్ము! నీలాంబరములోకి
దివ్యానుభూతు లవి దీపింపగా నన్ను!
అలసిపోబోకుమా! యారాట బడబోకు!
చిన్నికృష్ణునిపైని చింతయే గద మనకు!

మధురభక్తిని ప్రేమ మమత దొలికించుచును
శ్రీ మురళి జేరుటయె చింతగాదా మనకు!
లలిత గీతములతో లాలిత్య మొలికించి
విభుని జేరుటయె గద! విమలమౌ మన కాంక్ష!

అందాల నా మనస! యపురూప కల్పమా!
చిన్నికృష్ణుని పైని జివురింపు గీతి!

## శ్రీ మురళి నొకసారి

శ్రీ మురళి నొకసారి చెన్నార పాడవా?
మధుర స్వనములతోని మది పొంగిపోవా!

అలనాటి గోపికగ యందాలభామగా
మధుర నృత్యము సేతు మాధుర్యమొలకా!

శ్రీ మురళి నొకసారి చెన్నార పాడవా?
మధుర స్వనములతోని మది పొంగిపోవా!

అలనాటి ప్రేపల్లె యందాల వనవీధి
కడిమి చెట్టూ క్రింద కమ్మగా బాడినది!
ఆ పాట వినిపింపు అందాల నర్తనను
కలిసిపాడుము స్వామి! కమ్మని గీతితో!

యమునా తరంగాల విమల నాదములతో
కలిపి పాడిన నాటి కల్యాణ గీతమును!
పశు పక్షులన్నియును పరవశము జెందినా
ఆ పాట వినిపింపు నంపుకుందును స్వామి!

మధుర స్మృతులన్నియును మదికొచ్చు చున్నయవి
గతకాల వైభవము గనులముందుకు వచ్చె!
నను బిలుచుచున్నవీ నవభావములతోని
గతములో కెటుబ్లోదు కల్యాణ గుణధామ!

శ్రీ మురళి నొకసారి చెన్నార మ్రోయింపు
మధుర స్వనములతోని మది పొంగిపోవా!

## మురళి మ్రోయింపుచూ

మురళి మ్రోయింపుచూ మోహమును జిందుచూ
ననుజుట్టి దిరిగేవు! నను మాయజేసి!

కనుమూయ కలలలో గనిపించెదవు కృష్ణ!
కనుదెరువ పాటలో గదలాడు చుండెదవు!

మురళి మ్రోయింపుచూ మోహమును జిందుచూ
ననుజుట్టి దిరిగేవు! నను మాయజేసి!

నిను మఱచి పోనేల? నను మఱచి పోవేల?
నీకు నా మధ్యగల నిరవధిక స్నేహమిది!
ఆటపాటలతోన యలరారునది కృష్ణ!
చెరిగిపోనిది స్వామి! చిరకాల బంధమిది!

నీ మురళి గానమున నా పాట శ్రుతిలయలు
అతికిపోయెను కృష్ణ! అపురూపగతులతో!
నాదమై సెలయేటి జీవమై ప్రకృతిని
పండు వెన్నెలలోన బడి లేచుచున్నదీ!

నీ పాట నా పాట నింగిలో హంసలుగ
పయనించుచున్నవి పారవశ్యముతోని!
జంట కలువలవోలె సరసిలో నివసించి
మురిపించుచున్నవి! మోహమున ప్రకృతిని!

పాటంటె యెందుకో పరవశం బయ్యేవు!
నేనంటె యెందుకో నెలవంకవయ్యేవు?
దూరాన నుంచి నను దురపిల్ల జేయకుము!
మాయజేసీ నాదు మమతనంతా త్రోసి!

# నిను జెంద గోరితిని

నిను జెంచగోరితిని! నీటుగా శ్రీకృష్ణ!
దీపమున దీపమై దీపింపగోరి!
మధురమౌ సిగీతి మాధుర్యమును దేలు
మహిమ నా కబ్బునా మాధవా మఱియింక!

నిను జెంద గోరితిని! నీటుగా శ్రీకృష్ణ
దీపమున దీపమై దీపింపగోరి!

నింగిచుక్కలలోన నిలిచేటి భాగ్యమును
సంధ్య వెలుగులయందు చరియించు సుకృతియు!
వెన్నెలా కిరణాల వెలుగులను నీతోని
పాటపాడేటి యాభాగ్యమిక లేదుగా!

తీయనీ తెలుగులో తీపి పాటలు పాడి
సయ్యాటలాడేటి సమయమిక రాదుగా!
గోపికగ నే మారి గోవిందయనుచు నిను!
నోరార బిలిచేటి నోములిక లేవుగా!

విరహ వేదనతోని వెతజెంది నీ కొఱకు
కన్నీటి నొలికేటి గాథ లిక లేవుగా!
నీ మురళిపాటతో నే స్నిగ్ధ స్వరముతో
కిన్నెరను మీటేటి వన్నెలిక లేవుగా!
అందుకే శ్రీకృష్ణ యలరి నను నిటులుంచు!
వేదనను దపియించు విరహ గోపికనువలెం
కలుపుకోజూకు నీ కాంతి వెలుగులయందు
దాసిగానుంచి నను దయజూడు మెల్లిపుడు!



పిల్లి నగ్గోపి

## అందాల ప్రకృతిని

అందాల ప్రకృతిని యన్ని నీవేగాద!
అణువణువు నిండినా యఖిలాత్మకుడవూ!
చిరుగజ్జియలు మ్రోవ చిన్నారి మురళితో
పాటబాడుచు జగతి బరవశము జేయుదువు!
అందాల ప్రకృతిని యన్ని నీవే గాద!
అణువణువు నిండినా యఖిలాత్మకుడవూ!

నీవు లేనిది లేదు నీతోని నేనుందు!
సాగరములో గలిసి సరిత దాగినరీతి!
మబ్బులో మెఱుపులో మాటు మణిగిన విధము
నీలోన నేగలిసి నీలాంబరము నగుదు!

వింగిలోపల చుక్క నిలిచినా రీతిగా
నీ యెదను మిల మిలల నిలిచిపోవుదు స్వామి!
హరివిల్లులో నొక్క యందాల రంగుగా
గగనవీధిని మెరిసి కరిగిపోదును నీలో!

వినిపించుచుండు నీ విశ్వగోళములన్ని
నీ మురళి స్వనములే నిత్య నూత్నముగాగ!
పాటతో నిను గలిసి పరిమళించెద కృష్ణ!
జన్మబంధములన్ని జారిపోవగ జలధి!

అందాల ప్రకృతిని యన్ని నీవే గాద!
అణువణువు నిండినా యఖిలాత్మకుడవూ!

## ఎదుట నిలువుము కృష్ణ!

ఎదుట నిలువుము కృష్ణ! ఎన్నెన్నో అందాలు!
చూడముచ్చట గాగ సూటిగా జూతూ!
    చిత్రముగ వ్రాయనీ! శిల్పముగ జెక్కనీ!
    కనులలో నినుజేర్చి కలుపుకోనీ స్వామి!
ఎదుట నిలువుము కృష్ణ! ఎన్నెన్నో అందాలు
చూడ ముచ్చటగాగ సూటిగా జూతూ!

చిన్నారి మోములో జిందాడు అందాలు
కనలాడు కాంతులను కనులలో నింపనీ!
అరిగిపోకుండునటు తరిగిపోకుండునటు!
శిల్పముగ నినుజెక్కి జేర్చుకొందును మదిని!

నీకు నాకున్న యీ నిర్మలంబగు ప్రేమ
ఏనాటి దనుచు నేనెంచి చూడగనిమ్ము!
భావాలపొంతరను భద్రముగ నిను జేర్చి
అతికించుకొనియెదను అతుకులు లేకుండ!

మరచిపోకుండ నిను మది నిలుపుకొని యెదను
పాటలో నిను జేర్చి పల్లవిని గూర్చెదను!
కాటు గలిసెదనేమొ! కల్యాణ గుణధామ!
ముడివేసుకొందు నీ మోహాన్న మురళితో!

ఎదుట నిలువుము కృష్ణ! ఎన్నెన్నో అందాలు!
చూడ ముచ్చటగాగ సూటిగా జూతూ!

# వెలుగులో వెలుగునై

వెలుగులో వెలుగునై విరిసిపోనా కృష్ణ!
తళుకులో తళుకునై తరిగిపోవుదునా!

నీ మురళి పాటలో నే గలిపి గొంతుకను!
మధుర గీతముతోని మటు మాయ మగుదునా!

వెలుగులో వెలుగునై విరిసిపోనా కృష్ణ!
తళుకులో తళుకునై తరిగిపోవుదునా!

మలిసంధ్య వెలుగులను మధురముగ దూగాడి
మసక చీకటులందు మరిగిపోవుదునా!
ఉదయతారకు మల్లె యుదయించి తూర్పుదెస
తెలికాంతి పుంజముల దేలిపోవుదునా!

గలగలా సెలయేటి గండ శిలలను దాటి
అడవి దారులయందు నణిగిపోయిన రీతి!
వన వీధులన్నియును వరుసగా నే దాటి
నినుగాంచి నీలోన నిలిచిపోవుదునా!

కిన్నెరను నేవెడలి కీర్తనగ రూపొంది
సొగసులను నిను బాడి సోలిపోవుదునా!
జన్మ జన్మలనాటి స్నేహంపుటలలలో
కన్నీటి బిందువుల కలత బాయుదునా!

వెలుగులో వెలుగునై విరిసిపోనా కృష్ణ!
తళుకులో తళుకునై తరిగిపోవుదునా!

## మురళితో బిలిచేవు!

మురళితో బిలిచేవు! మోదమును వర్షించి
పలుకరాదా కృష్ణ! పన్నెత్తి పెదవి!
చెలియించు నను బిలువ జెదురునా నీ మనసు?
అదురునా? బెదురునా? యాపదల జిక్కునా?
మురళితో బిలిచేవు! మోదమును వర్షించి
పలుకరాదా కృష్ణ! పన్నెత్తి పెదవి!

కొండ కోనలలోని కోకిలా బాడినటు
వినిపించుదువు మురళి వీనులకు విందుగా!
అగుపింపదెందుకో యల్లారు ముద్దుగా
నను బిలిచి నోరార నాముందు పిలువవూ!

అర్ధరాత్రులయందు నలి సంధ్యలందునను
నిదుర బోయేవేళ నీటుగా నూచెదవు!
ప్రేమున్న వానివలె ప్రీతితో బిలిచెదవు!
దాపుకొచ్చి నన్ను దయతోని జూడవూ!

మనసులేని యిట్టి మమకారమెందుకో!
ప్రీతిలేనీ యట్టి ప్రేముడులు యెందుకో!
నోరార బిలువనీ నేరమేమో దెలిపి
మన్నించి నా తప్పు మమత జిందుము కృష్ణ!
మురళితో బిలిచేవు! మోదమును వర్షించి
పలుకరాదా కృష్ణ! పన్నెత్తి పెదవి!

## మురళితోనే బడితి

మురళితో నే బడితి మోహంపు టలలలో
సుడులు దిరుగుచునుంటి మ్రుక్కి పోవుచునూ!
కనుల పడబోనీకు కమ్మనీ సొగసులను
ఏమగుదునో యేమొ! యిలపైని నేనింక
మురళితో నే బడితి మోహంపు టలలలో
సుడులు దిరుగుచునుంటి! మ్రుక్కిబోవుచునూ!

నీ మురళి పాటలకు నే దాసినయిపోతి!
ఎటనుంటివో యనుచు యటమటము నొందితిని!
కిన్నెరను జేబట్టి గిరులన్నియును దాటి
తరులందు పొదలందు తరుణ! వెదుకుచునుంటి!

కిన్నెరను జేబట్టి కీర్తనను బాడుచును!
వాడ వాడలనన్ని వరుస వీథులనన్ని!
అగుపడిన వారలను నడుగుచుంటిని స్వామి!
నీ మురళి జాడలను నీ నీటు సొగసులను!

మురళితో నిటులైతి మోదమును బోనాడి
అందాల నగుమోము నగుపింపబోనీకు!
వెఱ్ఱినై మొఱ్ఱినై వేలగీతాలతో
భావాల పుట్టలో బడిపోదు నికరాక!
మురళితో నే బడితి మోహంపు టలలలో
సుడులు దిరుగుచునుంటి మ్రుక్కిపోవుచునూ!

## ఈ మాట! ఈ పాట!

ఈ మాట! ఈ పాట! నింపొంద నేర్పితివి!
మధుర మురళిని గూడ మమత నేర్పితివీ!
గోపకాంతలనుండి గోప బాలురనుండి
కొమ్మ రెమ్మలనుండి గోవింద! నేర్పితివి!
ఈ మాట! ఈ పాట! నింపొంద నేర్పితివి!
మధుర మురళినిగూడ మమత నేర్పితివీ!

జగమంత పులకింప జాగృతిని వెలయింప
ఆటపాటల నిటుల యలరితివి గదస్వామి!
సృష్టి స్థితి లయములను సుందరం బంతయును
ఆటపాటల నొదిగి యలరియుందును గదా!

ఆనాటి గోపికలు అంద చందాలతో
ఆటపాటల నేర్పి యలరించినారు నిను!
గోపబాలురె నీకు గురువులయి యలనాడు
మురళి బాడగ నేర్పి మురిపించినారుగా!

నీ మురళి స్వనములను నీటుగా నే వినుచు
ఏ నోము పున్నెమో యిటులయితి గోపికగ!
మధుర గీతములల్లి మానసము జిగురింప
ఆడి పాడుచునుంటి అందాల శ్రీకృష్ణ!
ఈ మాట! ఈ పాట! వింపొంద నేర్పితివి!
మధుర మురళిని గూడ మమత నేర్పితివీ!

## నీ మురళి స్వనములను

నీ మురళి స్వనములను నిలువనీ నా పాట
మధుర పదములతోని మధురిమలు జిందా!
తీయనీ భావాలు తేనెలూరేలాగు
మమత పొంగేలాగు మాధవా! నీపైని!
నీ మురళి స్వనములను నిలువనీ నా పాట
మధుర పదములతోని మధురిమలు జిందా!

ముత్యాలు పేర్చినటు మురిపాలు జిందినటు
మధురాక్షరములతో మాధవా! గూర్చనీ!
మనసులోనున్న నా మధుర ప్రేమను జిలికి
పాటగా గూర్చనీ భక్తి భావముతోని!

కమ్మనీ వలపులను గరుగుచూ పులకించి
తీయనీ రాగాన దీర్చెదను గీతిగా!
లలిత పదములతోని లాలిత్యమొప్పగా
సుమమాధవాసంతి సుందరంబులు జిందా!

హరివిల్లు విరిసినటు సందాల నింగిపై
అరవిందములు విరిసి యాడినటు కొలనులో!
నీ పైని నా ప్రేమ నిలిచినటు గోపికగ!
ఆనాటి మన ప్రేమ యందాలు గూర్చెదను!

నీ మురళి స్వనములను నిలువనీ నా పాట
మధురపదములతోని మధురిమలు జిందా!

# ఎంత నడచినగాని!

ఎంత నడిచినగాని సుంత దరుగదుగదా!
అంతులేనీ యాత్ర! యపురూప! నీతో!
అల్లంత దూరాన యగుపించు నీ నీడ!
ఇల్లింత దూరాన వినిపించు నీ మురళి!
ఎంత నడిచినగాని సుంత దరుగదుగదా!
అంతులేనీ యాత్ర! యపురూప! నీతో!

కొండ కోనలదాటి కోనేరులనుదాటి
చెట్టుపుట్టులదాటి మిట్టపల్లములా!
అన్నిదాటీ నేను నడవులన్నీ దాటి
పయనించుచుంటినీ పరవశము జెందుచును!

తిరిగి చూడవుగదా! తీరుగానొకసారి
మాటాడబోవుగా మమత పొంగారగా!
కలిసి మెలిసీ నన్ను గారవింపవుగదా!
మమతదీర్చ ప్రేమ మన్నింపబోవుగా!

కాలగతి దొరలినటు గడిచిపోవలెనేమొ!
ఋతువులిల మారినటు బ్రతుకులింతేనేమొ!
నీ వెనుక నడుచుటే నిఖిలాత్మ! నా త్రోవ!
మన్నింపకున్ననూ! మఱచిపోయినగూడ!
ఎంత నడిచినగాని సుంత దరుగదుగదా!
అంతులేనీ యాత్ర! అపురూప నీతో!

## కోరికలు లేనట్టి

కోరికలు లేనట్టి గోపవనితను కృష్ణ!
మనసిచ్చినా నాటి మగువ నే కృష్ణా!
చెదిరినా మన ప్రేమ జేర్పుమా! ఒకచోట
రాగ తాళములతో రమణీయ గీతిగా!
కోరికలు లేనట్టి గోపవనితను కృష్ణ!
మనసిచ్చినా నాటి మగువ నే కృష్ణా!

వేరుండలేను నిను విడిచి ఒక క్షణమైన
తావిలేని పూవు దగయుండలేనటుల!
తెల్లమబ్బుల వోలె దేలిపోవుచునుంటి
దూరాన నుంచి నను దురపిల్ల జేయకుము!

ఎండమావులు జూచి నిండు తనమును బాసి
బెండుదనమునదేలి బేలనై పోతినీ!
పలవించుచుంటినీ భవ్య! నీ నీడకయి!
విలపించుచుంటినీ వేగిరము నిను గలియ!

మధురగీతముతోని మాధవా! యని బాడి
నీ మురళిలో గలియ నిండారు నా కోర్కె!
మోహనా! హృది జేర్చి మోదమును గూర్చుమా!
భవబంధములనుండి భద్రమును గూర్చుమా!
కోరికలు లేనట్టి గోపకాంతను నేను
మనసిచ్చినా నాటి మగువ నే కృష్ణా!

## ఈ జీవయాత్రలో

ఈ జీవయాత్రలో ఈ మధురయాత్రలో
ఎన్ని మధురస్మృతులు ఎన్నెన్ని కథలూ!
మఱుజన్మలో మఱల మనసునకు వచ్చునా?
మనసులో ఈ పూల మధురిమలు విరియునా?
ఈ జీవయాత్రలో ఈ మధురయాత్రలో
ఎన్ని మధురస్మృతులు ఎన్నెన్ని కథలూ!

ఈ భక్తి మొలకలయి ఇంపారు తీవెలయి
పూలు పూచినయటుల పులకలిటు గలుగునా?
హంసనై శ్రీ మురళి యాకాశవీధిలో
తెల్లిమబ్బులలోన తేలుటది జరుగునా?

మధుర గీతముతోని మధురిమల దొలుకుచును
శ్రీనాథు భక్తితో సిరులు మాగుదునా?
లలిత గీతము బాడి లావణ్య గోపికగ
గోపబాలునితోని కూడి చరియింతునా?

మరుజన్మలో కృష్ణ! మఱచిపోవుదునేమొ?
తీయనీ నీ పాట తెపి గోల్పోదునో!
కమ్మనీ నీ స్మృతులు గలుగునటులుగజేసి
మన్నించు గోపాల మఱుజన్మ యాత్రకయి!
ఈ జీవయాత్రలో ఈ మధురయాత్రలో
ఎన్ని మధురస్మృతులు ఎన్నెన్నికథలూ!

# ఈ రాత్రికిక చాలు!

ఈ రాత్రికిక చాలు! ఇంపొందు శ్రీ మురళి
పాట నాపుము కృష్ణ! పరవశమునైతి!
        ఆనంద సుధలలో నటు మునిగిపోతినో!
        దివిలోని యందాల దీపమయి పోతినో!
ఈ రాత్రికిక చాలు! ఇంపొందు శ్రీ మురళి
పాటనాపుము కృష్ణ! పరవశమునైతి!

చుక్కలను రిక్కలను సుందరంబగు నొక్క-
హంసనయి రెక్కలను నల్లార్చుచుంటినో!
వెన్నెలల పువ్వుగా విరజిమ్మ కాంతులను
మత్తుగా కొలనిలో మైమఱచిపోతినో!

మధుర సంధ్యల గూడి మైమఱచి కుంకుమల
దిరుగాడుచుంటినో! తీరు తెన్నూ లేక!
అందాల వీణలో నపురూప తంత్రిగా
మధుర స్వనములతోని మార్మ్రోగుచుంటినో!

నాలోన నే లేను నవనీత! యిక చాలు!
నీ మురళి స్వనము లిక నిలుపుమా! గోపాల!
విరహాక్రాంతగ జేసి వేధింపబోకు నను!
పదిమంది జూచి నను బరిహాస మాడెదరు!
        ఈ రాత్రికిక చాలు! ఇంపొందు శ్రీ మురళి
        పాటనాపుము కృష్ణ! పరవశమునైతి!

# ఆ దరిని నిలిచి

ఆ దరిని నిలిచి నీ వందాలు జెదరగా
మురళి బాడెదవేల ముద్దుగా కృష్ణా!
        రారాద! ఈ దరికి రమ్యమౌ నా గీతి
        వినిపించెదను కృష్ణ! వీనులకు విందుగా!
ఆ దరిని నిలిచి నీ వందాలు జెదరగా
మురళి బాడెదవేల? ముద్దుగా కృష్ణా!

అలల తాకిడి తగిలి అందాల శ్రీ మురళి
తీరుగా నా చెవిని తేనెలొలుకుట లేదు!
మబ్బుచాటున జిక్కు మధుర వెన్నెలలవలె
అలల తెరలను మురళి యస్పష్ట ధ్వనులయ్యె!

అరవిందములపైని యలరు గలువలపైని
తుమ్మెదల గుంపులవి తూలి మూగిన యటుల
మలిసంధ్య కాంతులను చెలరేగి చీకటులు
అందాలు మాపినటు నగుపించె నీ మురళి!

పడవ నంపుచునుంటి పయనమై రారమ్ము!
అంజలించిన పూలహారతులు గైకొనుము!
తీయనీ శ్రీ మురళి తీరుగా వినిపింపు!
పల్లవని నే నగుదు! పరమ పావన కృష్ణ!
        ఆ దరిని నిలిచి నీ వందాలు జెదరగా
        మురళి బాడెదవేల? ముద్దుగా కృష్ణా!

## మధుమాసమిది స్వామి !

మధుమాస మిదిస్వామి! మన్నింతువని దెలియు
చివురు బూవులతోని జేరవత్తువనీ!
చిఱు గజ్జియలు మ్రోవ! చిందించి నాట్యముల
మురళి నూదూకొనుచు ముద్దుగా వత్తువని!
మధుమాసమిది స్వామి! మన్నింతువని దెలియు
చివురు బూవులతోని జేరవత్తువనీ!

మధుమాసమున నన్ను మమతతో బ్రోతునని!
బాసజేసితివిగద! పలుకెటుల దొలగెదవు?
మావిగున్నలు జూడ మాలతీలతజూడ
మందారములు గూడ మధురముగ వినుచుండ!

సెలయేటిలో నవ్వు చంద్రుడే మనసాక్షి!
గగనాన నీలిమల కాంతులే మనసాక్షి!
అడవి పూలన్ని నీ వాడినా మాటలను
మధురాక్షరములతో మమతతో గూర్చినవి!

చేసినా బాసనూ చెరిగిపోనీకుమా!
అందాలగోపికను ననుమాట మరువకుము!
మురళితో రారమ్ము! మోదమును గూర్పుమా!
పుష్పాంజలిని గొనుము! పున్నమీ రాత్రి యిది!
మధుమాస మిది స్వామి! మన్నింతువని దెలియు!
చివురు బూవులతోని జేరవత్తువనీ!

# భక్తి పంజరములో

భక్తి పంజరములో బందీని శ్రీ కృష్ణ!
పంజరము విడిపోను! బాధ లెన్నున్నా!
కాంతిలో కాంతిలో గలిసిపోయేదాక
కడదాక నీతోని కలిసి పయనించెదను!
భక్తి పంజరములో బందీని శ్రీ కృష్ణ!
పంజరము విడిపోను బాధ లెన్నున్నా!

వన్నెలను చిన్నెలను వయ్యారములు జూపి
మధురమగు నీ మురళి మాధుర్యమున బడితి!
తిరిగి పోనెన్నటికి జేరనింకెవ్వరిని
జన్మ జన్మలదాక జరియింతు నీతోని!

పంజరము నుండి నను బయలులో వదిలినను
మబ్బులను వదిలినను మరలి తిరిగొచ్చెదను!
సప్తసంద్రములందు సరసతను వదలినను
నీ భక్తి పంజరము నీడనుందును కృష్ణ!

కన్నార నను జూచి చెన్నార యెదజేర్చి
తియ్యనీ మురళినీ జేర్చునందాకనూ!
విచ్చినా పూదీవె విడిన పూవులరీతి!
జన్మలెన్నయిననూ చరియింతు నీతోని!
భక్తి పంజరములో బందీని శ్రీ కృష్ణ!
పంజరము విడిపోను! బాధ లెన్నున్నా!

# పాట బాడేటి నను

పాటబాడేటి నను బరికింపవా కృష్ణ!
నిన్ననుకరించేటి నీటు కత్తియనూ!
    నీ మధుర స్వనములకు నేరాగ ధ్వనినోయి!
    నీ పాద కమలముల నిలుచు తుమ్మెదనోయి!
పాట బాడేటి నను బరికింపవా కృష్ణ!
నిన్ననుకరించేటి నీటు కత్తియనూ!

పండుటాకులు రాలి యెండుటాకులు దుల్లి
చిగురించి తరులన్ని చివురాకు వేసినట్లు!
పాటతో నా మనసు పడిలేచి యాడేటి
పావగా చూపొందు పరమ సంతోషమును!

కాఱు మబ్బులలోన గటిక చీకటులందు
కుందుచూ నా మనసు కుమిలేటి సమయాన!
సరస సంగీతమున సంజ కెంపుకు మల్లె
కుంకుమల రంగుగా క్రొత్తలను వెదజల్లు!

ముద్దుగా మురళిలో మోహనా రాగాల
విరియింప లోకాలు ధరియించితివి గదా!
నినుగోరి నా మనసు నిండు జూలాలాయె!
విడనాడ న్యాయమా? విడని నీ దాసినీ!
    పాట బాడేటి నను బరికింపవా! కృష్ణ!
    నిన్ననుకరించేటి నీటు కత్తియనూ!

## మాటంటె యెందుకో!

మాటంటె యెందుకో మఱి బిడియమౌతాది!
పాటంటె యెందుకో పరుగులిడతానూ!

పున్నమి వెన్నెలగ పులకించి మదిపొంగి
రాగాలు దీస్తాను! రమణీయ నర్తనల!

మాటంటె యెందుకో మఱి బిడియమౌతాది
పాటంటె యెందుకో పరుగులిడతానూ!

కొండ కోనలనుండి కోనేట దూకేటి
సన్నని జాలులా చిన్నారి నా పాట!
ఆటలాడే పాప యలరు జిఱునవ్వగా
కిన్నెరా రవళితో కిలకిలా మంటుంది!

మాటంటె యెందుకో మఱి బిడియమౌతాది!
తెలుపలేనెందుకో! తేటపఱచి మనసు!
నెలవంక మాదిరిగ నేల జూపులు జూతు!
ముద్దబంతీ లాగు మూగినయి పోదునూ!
అందుకే పాటతో నలరి బిలుచుచు నుంటి
సిగ్గు బిడియములేక చిన్నారి గీతమున
హరివిల్లులాగు నే నందాల జిందుచును
కోకిలా గొంతులా కోన కోనల కృష్ణ!

నా గీతి భావమును సయముగా మన్నించు
అందాల రాగాల యలరి వీక్షింపుమా!
కాంతిరేఖను కలిపి కలకాల స్నేహమును
వొలికించు చిలికించు నోరంపు నా ప్రేమ!

## ప్రేమించవని చెలీ!

ప్రేమించవనీ చెలీ! ప్రేమింప నీవే!
వన్నె గోపాలునీ వగలన్ని తెలియులే!
నను బిలుచుటకు గదా నా స్వామి వనవీధి
పిల్లనా గ్రోవినీ ప్రీతితో బాటుటది!
ప్రేమించవనీ చెలీ! ప్రేమింప నీవే!
వన్నె గోపాలునీ వగలన్ని దెలియులే!

గోపకన్నియననీ గోలగా ననుదలచి
వలచి వచ్చెదనంచు వగలాడు దలచెలే!
సన్నగా నూదేటి చిన్ని గోపాలునీ
కథలన్ని తెలియులే! కటిగిపోనే చెలీ!

మందారములు దెచ్చి మాలగా నే గ్రుచ్చి
సింగారముగ నల్లి శ్రీనివాసుని యెదను!
అందింతునని యేమొ! ఆశగా నున్నాడు!
మోసపోనే చెలీ! మో మటకు ద్రిప్పనే!

అందాల భరిణ! నే సతిలోక సుందరిని!
మురళిలో నున్న యా మురిపాలు దెలియులే!
నా స్వామి రావాలి! నా దరికి ప్రేమతో!
అపుడె యంజలితోని యాత్మ నర్పించెదను!
ప్రేమించవనీ చెలీ! ప్రేమింప నీవే!
వన్నె గోపాలునీ వగలన్ని దెలియులే!

## పాట పాడి

పాట పాడి నీ చరణ కమలముల
భక్తి జేర నాశించితినీ! కృష్ణ!
    అందులకే పలు జన్మలనుండీ
    ఆడిపాడి నే గోపిక నయితిని!

పాట పాడి నీ చరణ కమలముల
భక్తి జేర నాశించితినీ! కృష్ణ!
తీయని నామది మధుర భావమును
తెలియ జేసితిని మంజుల గీతిని!
విడిపడనీ యల స్మృతుల నన్నిటిని
విప్పగలిగితిని విమల రాగమున!

పాటతోని నీ పదముల నల్లుచు
మీటుచు కిన్నెర నీ దాసిననీ!
నాట్యముతో నీ సఖి నటించునా!
నలువురితో నే మెలువుచుంటినీ!

నాట్యగానముల లయ తాళములను
నవనీతా! మది మఱి మెచ్చెదు గద!
అందులకే నీ పాటల వరుసగ
ఆలపించుటిది తేట తెనుగునా!

ఎంతటెందఱో భక్తి భావమున
అంచముగా నీ మురళిని జేరిరి!
సన్నుతింతు నిను రాత్రింబవళులు
సరస గీతముల సన్నిధి జేరగ!

# నీ మురళి స్వనములను

నీ మురళి స్వనములను నింపినది నా మనసు
సెలయేటి సవ్వడిగ జాలుగా కృష్ణా!
ఉదయ సంధ్యలకు వలె వన్నెలను జిందుచూ
నా మనసు గోపాల! నాట్యమాడినదోయి!
నీ మురళి స్వనములను నింపినది నా మనసు
సెలయేటి సవ్వడిగ జాలుగా కృష్ణా!

బాలసూర్యుని ప్రభల బంగారు కాంతిగా
విశ్వమంతా నిండి వేడుకను గొలిపింది!
పున్నమి వెన్నెలను పులకించి వికసించి
కలువ కన్నెకువోలె కాంతులను నింపింది!

చిగురు పూవులతోని చిత్రముగ వనవీధి
వాసంత లక్ష్మిలా వన్నెలను జిందింది!
జన్మ జన్మల భక్తి సాంద్రమైనా మనసు
నింగి నీలమునందు నిలిచింది తారగా!

బంగారు లేడిలా పరువులే తీసింది!
రాజహంసకు మల్లె రమణీయ మొలికింది!
మనసొక్క భావమయి మధురముగ పైకేగి
విశ్వ విభునీ గూర్చి వింతగా పాడింది!
నీ మురళి స్వనములను నింపినది నా మనసు
సెలయేటి సవ్వడిగ జాలుగా కృష్ణా!

## మఱచిపోయినా

మఱచిపోయినా మధుర మురళినీ
మఱల మఱల వినిపించు టెందుకో!
సుందరమగు నీ మోము దమ్మినీ
సురుచిరముగ జూపించు టెందుకో!

మఱచిపోయినా మధురమురళినీ
మఱల మఱల వినిపించు టెందుకో!

మాసిపోయినా మధుర స్మృతులనూ
మఱి మఱీ నామది నిలుపు టెందుకో!
నీడవోలె నను వెన్నంటుచునూ
నీలి గగనమున నిలుచు టెందుకో!

పిలువకపోయిన బిలుచు టెందుకో!
పాడకపోయిన బాడు టెందుకో!
మఱచిపోయినా మనసు తెరలలో
మల్లెలు విరిసే టెందులకో మఱీ?

ఇంత ప్రేమ యని తెలియకపోతిని!
అంతరంగమున నెంచక పోతిని!
చింతజేయకను బెదిరిపోయితిని!
చెంత జేర్చుకొనుమా! గోపాలా!

మఱచిపోయినా మధుర మురళినీ
మఱల మఱల వినిపించు టెందుకో!

# కల జెఱుపకే చెలీ!

కల జెఱుపకే చెలీ! కల జెఱుపకే!
కలలోన దీయనీ కథ నడుచునే!

బాలకృష్ణుడు నేను బంగారు దీవిలో
విహరించుచుంటిమే వేడుకలు బొంగార!

కలజెఱుపకే చెలీ! కల జెఱుపకే!
కలలోన దీయనీ కథ నడుచునే!

చక్కనీ నా స్వామి
నరస నే గూర్చుండి!
పిల్లనాగ్రోవినీ ప్రీతితో వినుచుంటి!

తారలను విహరించి
తగజాబిలిని జేరి!
వెన్నెలా తీగెలను వేడుకను నుంటిమే!

జన్మ జన్మలనాటి
మర్మముల వినిపించి
కన్నీట పదములను గడుగగా మాధవుడు
మురళి శిరమున నుంచి
ముద్దుగా యెదజేర్చి
తనలోన గలుపుకొనె తన్మయము నే నొంద!

కల జెఱుపకే చెలీ! కలజెఱుపకే!
కలలోన దీయనీ కథ నడుచునే!

# హరిని ప్రేమించితిని

హరిని ప్రేమించితిని యంతరంగమునందు
వేయి కణములనైతి విరహాగ్ని మసిలీ!
హరిని నే బొందగా నహరహము మదిపొగిలి
పాటగా నే మారి భావగీతము నయితి!
హరిని ప్రేమించితిని యంతరంగమునందు
వేయి కణముల నయితి విరహాగ్ని మసిలీ!

చిన్ని మురళిని నూది చిలికించి నా మనసు
దోచుకొని మురళిలో దాచుకున్నాడేమొ!
నా మనసు నిలవదూ! నలుదిశలను వెదుకు!
అలత కలతను బొందు పొలికించు కన్నీరు!

సుందరంబగు రూపు నందించి కన్నులకు
ఎందుజూచినగాని యందమే కనజేయు!
అందమున నందమౌ సుందరుడు గనరాడు!
కందిపోయిన కనులు చిందించె బాష్పములు!

వేణుగానమునుండి విశ్వగానములోకి
పయనించితిని గదా! భావగీతము నయితి!
అణువణువునందునను నాతడే గనిపించు
పిల్లనగ్రోవి యా పిలుపులే వినిపించు!
హరిని ప్రేమించితిని యంతరంగమునందు
వేయికణముల నయితి విరహాగ్ని మసిలీ!

## ఆటుపోటు లవేల?

ఆటుపోటు లవేల? యలల సంద్రములేల?
చిన్ని కాలనే చాలు! చేరి మన మాడుటకు!

    చిన్ని కలువలతోని చిఱునగవు జిందుచూ
    వన్నెగోపాల! నా వగలన్ని జూపింతు!

ఆటుపోటు లవేల? యలల సంద్రములేల?
చిన్ని కాలనే చాలు! చేరి మన మాడుటకు!

అందాల మేడలను ఆకాశ హర్మ్యాలు
పాలరాతిని గూర్చు పసిడి భవనములేల?
మట్టిగోడలనున్న మధురమగు జీర్ణకుటి
చల్లని కాపురము చాలులే గోపాల!

నీవు మురళిని నూదు! నే గోపకాంతనై
ఆనంద వాహినిని యలరుచును బాడుదును!
పక్షులన్నియు పరుల బరవశము నొందగా
జంతుజాలముదంత చరియింప మోదమున!

ఆటలను ననుగూడి పాటలను నినుజేరి
తొలి సంధ్యకాంతులుగ దోబూచులాడుదము!
గోపగోపికలుగా గోవిందు రాధలుగ
ఆడిపాడీ మనము నైక్యమైపోదాము!

    ఆటుపోటు లవేల? అలల సంద్రములేల?
    చిన్ని కాలనే చాలు! చేరి మనమాడుటకు!

## మనసునంతా

మనసునంతా పోచుకున్నా
మాధవుని నే జూడనోల్లను!
కమ్మనీ కలనైనగానీ
కానరాడే యెంత బిలిచిన!
మనసునంతా నోచుకున్నా
మాధవుని నే జూడజాలను!

అందమయిన రూపుజూపి
సుందరుడు గోపాల బాలుడు!
చిందె నాపై మధుర ప్రేమను
ఎందు బోయెనో! నన్ను విడిచీ!

ఆడినా యాటలను మఱచెను
పాడినా యా పాట మఱచెను!
తీయనీ యా స్నేహమంతయు
తీరుగా నన్నియును మఱచెను!

నిదురలేకను నింగి జూచుచు
నీరసించితి యతని కౌఱకయి!
పిల్లనాగ్రోవీని బాడుచు
మెల్లగా రాడెందుకో మఱి?
కఠిన శిలగా గుడిని నిలిచెనో!
కౌగితముపై నతికిపోయెనో!
కలను సహితము గానరాడే!
కాంత! యిక నే నేమి సేతును?



పిల్లనగ్రోవి

# ఎంతకాలమునుండి

ఎంతకాలమునుండి యెదురు జూచుచునుంటి!
నీ దర్శనము కొఱకు నిండుగా కృష్ణా!
దర్శనంబీయగా దగనీదు రాకడను
చిలుక గోరింకలవి చిత్రగ చెప్పినవి!
ఎంతకాలమునుండి యెదురు జూచుచునుంటి
నీ దర్శనము కొఱకు నిండుగా కృష్ణా!

సంధ్యకాంతులు నూత్న సరసత్వ మొలికినవి!
చల్లగాలులు కదిలి పల్లవిని బాడినవి!
ప్రకృతి యందాలతో బరవశము నొందినది!
నా మేను బులకించి నాట్యాలు జేసినది!

ఎన్ని జన్మములయిన నన్నెపుడు నీ నుండి
వేఱు జేయగలేవు! విభజింప లేవుగా!
ఈ నాటికొచ్చినవి యింపుగా నీ దయలు
నా బ్రదుకు ధన్యమై నవరసము లొలికినది!

నా మనస దెందుకో నాట్యాలు జేస్తోంది!
తీయనీ వాసనల దేనెలొలుకుతు వుంది!
పరమేశు పదములను భక్తితో వ్రాలుటకు
అందుకే కాబోలు! అరాట బడుతోంది!
ఎంతకాలమునుండి యెదురు జూచుచునుంటి!
నీ దర్శనము కొఱకు నిండుగా కృష్ణా!

# నీలిమబ్బులలోన

నీలిమబ్బులలోన నిలిచినా జాబిల్లి!
కల్యాణధామునీ కొంతు జూచితివా?
విరహజ్వాలను జిక్కి వేగుచుంటిని కరము
కనికరముతో నాదు కొంతు దరిజేర్పుమా!
నీలిమబ్బులలోన నిలిచినా జాబిల్లి!
కల్యాణధామునీ కొంతు జూచితివా?

చిన్ని కృష్ణుని బొంచ చింతించి నా మనసు
కొండకోనల యందు గోకిలగ పాడినది!
నా మీద దయలేదు నవనీత చోరునకు
తీయనీ నా ప్రేమ తెరుగా గై కొనడు!

సతిపతుల గూర్చెటి సఖుడ వీవేగదా!
సతినైన వేగ నా పతిని దరిజేర్పుమా!
వెన్నెలా బాణాల వన్నెలను గురిపించి
సతికి బందీగ నా పతిని సమగూర్పుమా!

వేయిమ్రొక్కులు మ్రొక్కి వేసారితినిగదా!
తీయనీ గీతాల తీర్థమాడితిగదా!
కోటి పూవుల పూజ గోరిజేసితిగదా!
రాడేమి నాస్వామి? రంజిల్ల నాదు మది!

నీలిమబ్బులలోన నిలిచినా జాబిల్లి
కల్యాణధామునీ కొంతుజూచితివా?



పిల్లి సుగ్రోవి

## మాటి మాటి కిటు

మాటి మాటి కిటు మధుర వేణువుల
మానసమును బులకింపకుమా కృష్ణ!
　　దీపింపకు నీ దివ్య కిరణముల
　　దిక్కులన్నియును తేజము నిండగ!
మాటి మాటికిటు మధుర వేణువుల
మానసమును బులకింపకుమా కృష్ణ!

కోరిన కోరిక కొసలను దాకవు!
విరిసిన వలపును నీడేర్పవుగా!
పూచిన కలువను బులకింపవుగా!
కనిన కలలనూ కాంతులు నింపవు!

ఎన్నినాళ్ళ ఓ మధుర గీతమూ!
ఎన్నినాళ్ళ వీ మర్మ వేదనలు!
కన్నా! నామది పిలిచిన పిలుపులు
కఱుగ వెందుకో కర్పూరముగా!

నా మనసున గల పూనిక తీర్పవు!
నమ్మిన దాసిని సమ్మతి జేయవు!
కమ్మని స్వనముల పిల్లన గ్రోవిని
కల కలముల మది గ్రమ్మజేయుదువు!

మాటి మాటికిటు మధుర వేణువులు
మానసమును బులకింపకుమా కృష్ణ!

## తెలి మబ్బుగ

తెలిమబ్బుగ నే నింగిని
దేలిపోవుచుంటి కృష్ణ!
నీ విరహముచే నే నిటు
నిలువలేక పొగులుచుంటి!

తెలిమబ్బుగ నే నింగిని
దేలిపోవుచుంటి కృష్ణ!

పొగమంచుగ పైకిలేచి
పోవుచుంటి నెటకెటకో!
వనవీధుల పర్వతముల
వాహినిపై బోవుచుంటి!

మంచు బిందువులుగ మారి
మధురమయిన పూ లతలను
నిలువలేక దొరలి దొరలి
నేలపైని రాలుచుంటి!

రావియాకు వోలె కదిలి
రవరవలను జేయుచుంటి!
పక్షివోలె యాకసమున
జలుదావుల బోవుచుంటి!

నీ మురళీ నిస్వనముల
నే నిటు లయితిని స్వామీ!
ఆర్తి బాపి యాట నాపి
యాదరింపు గోపాలా!

## పాట పాడమని

పాట బాడమని పలవరించెదవు!
భావము లెటు గొనివత్తును కృష్ణా!
మెత్తని పదముల దీయగ నెటువలె
జిత్తము రంజిల జేయుదు నోయి
పాట బాడమని పలవరించెదవు
భావము లెటుగొని వత్తును స్వామీ!

పాడి పాడి నా మనసు తెల్లనయి
పాలరాతిగా మారె గనోయీ!
ఝుమ్మన బాడీ గమ్మన యాగిన
తుమ్మెదగా నే మారిపోతినీ!

మధుర వసంతము కోకిల రాగము
మధువులు జిందే దొక ఋతువేగా!
ఆఱు ఋతువులను నలరిబాడు మన
అందమగున యిది గోపాలా!

అంత మోదమా నా పాటలకూ?
అలరెద వెందుకు అంతానందమ?
మధురమైన నీ మురళిని నిమ్మా!
మాటి మాటికిని బాడెదనోయీ!

పాడుచుంటి నిటు ప్రణయభావమున
పాలుపొంగుగా భక్తి పొరలగా!
పావనమగు నీ చరణకమలముల
పతితపావనా! చేరగనిమ్మా!



పిలుపులు

# కంటినుండీ నీరు

కంటినుండీ నీరు కాలువలు గట్టగా!
కఠినమైనా మనసు గఱుగ దెందులకూ?
పతివనుచు నిను దలచు సతినైన నన్నిటుల
కలత జఱుచుట తగున? కల్యాణ భామా!
కంటినుండీ నీరు కాలువలు గట్టగా
కఠినమైనా మనసు గఱుగదెందులకూ!

హృదయమంతా పఱచి
మధువులను జల్లితిని!
అడుగుమోపీ నాదు ఆర్తి బాపగ రావోయి!

తేనెలో మాగినా
తియనీ పదములను
సుకుమారభావాల జోష్యముగ కూర్చితిని!

పరవశముతో నేను
బాడినా గీతినీ!
మధుర వేదనను విని మన్నింపరావోయి!
కన్నీరు జే దుడిచి
కలవరము నాప్రమా!
తీయగా మాటాడి తీర్పుమా కోరికను!

కంటినుంటీ నీరు కాలువలు గట్టగా!
కఠినమైనా మనసు గఱుగ దెందులకూ?

## కస్తూరివలె నాదు

కస్తూరివలె నాదు కమ్మనీ మనసోయి!
కోకిలావలె నాదు గొంతు శ్రీకృష్ణా!
చూపులేదని నన్ను రోదింప జేయకుము!
మనసు దెలిసీ నన్ను మన్నింపుమో స్వామి!

కస్తూరివలె నాదు కమ్మనీ మనసోయి!
కోకిలా వలెనాదు గొంతు శ్రీకృష్ణా!

తళ తళలు నిగ నిగలు దరగనీ సొగసులూ!
వెండి బంగారముల వెల నాకు లేవోయి!
కమ్మనీ కస్తూరి కల్యాణినై నేను
నీ చిన్ని నుదుటిపై నిలిచెదను గోపాల!

హంస నడకలు నడిచి యలరి జూపగ లేను!
నెమ్మిలా నాట్యాల నీటుగ త్రియగాను!
మధు వసంతమునందు మావి కొమ్మలపైని
తీయగా బాడేటి తెనుగుపిట్టను నేను!

చూపులేదని నన్ను రోషాన జూడకుము!
మనసు తీయనిదనము మాధవా! గమనింపు!
అందాలు నాకేల? యచ్చరను గానేల?
చిక్కనీ మనసోయి! చిదిమి చూడుము నన్ను!

చిఱుకొంతులను జిందె సిరుల నొలికించేటి
నెలవంక సొగసోయి! నీటుగా గోపాల!
మనసు దెలిసీ నన్ను మన్నించి దయజూడు!
చిన్ని దీపమునుచు జీదరింపకు స్వామి!

## చిఱు గజ్జియలను

చిఱుగజ్జియలను నాట్యము సేయకు
చిన్నికృష్ణ నా మనసుననూ!
కన్నులలో పే వన్నెల జిందుచు
కదలాడకుమా! గోపాలా!

చిఱుగజ్జియలను నాట్యము సేయకు
చిన్నికృష్ణ! నా మనసుననూ!

మధుర వేదనల పొగల సెగలనూ
మనసేమగునో మంటల దగులుచు!
మనసున నున్నా మధురమూర్తి! నీ
కంటునేమొ! యా యావిరి సెగలూ!

విరహ వేదనను వేయి భాష్పములు
కనులను జారుచు కాలువ దొలుకగ!
కనులనున్న నీ కమ్మని రూపము!
కఱుగునో! చెఱుగునో! కాంతి తఱుగునో!

కనిపింపుము నా కనుల నిండుగా!
వినిపింపుము నీ వేణువు దీయగ!
చాటుమాటు ఈ యాటలేలనో
చయ్యన నీ యెద జేర్చుకొనుమోయి!

చిఱుగజ్జియలను నాట్యము సేయకు
చిన్నికృష్ణ! నా మనసుననూ!

# పడిలేచు దరగలా

పడిలేచు దరగలా పయనించు చుంటి నే
విభుని సన్నిధికి సఖి! వేయి గీతములా!
చిలుక గోరింకలూ! చెన్నారు గోకిలలు!
నా ముందు వెనుకలను నడువగా నే నలరి!
పడిలేచు దరగలా పయనించు చుంటినే
విభుని సన్నిధికి సఖి! వేయి గీతములా!

విప్పారు పింఛమున
వేయ నాట్యాల శిఖి!
నన్ననుసరింపగా నాతి! పోవుచునుంటి

తుమ్మెదలు ఝుమ్మనుచు
తుదిలేని పాటలను!
పాడగా నే కదిలి పరువు లెత్తుచు నుంటి!

చెన్నార నా విభుడు
జేర్చుకొనునో లేదొ!
నన్ను మన్ననజేసి నా కోర్కె దీర్చునా?
జ్యోతిలో జ్యోతిగా
ప్రీతి నను జేర్చునా?
కాంతిలో కాంతినై కలిసిపోవుదునా?

పడిలేచు దరగలా పయనించు చుంటి నే
విభుని సన్నిధికి సఖి! వేయి గీతములా!

## విరిసినా పువుజూడ

విరిసినా పువుజూడ విభుడు డలపున మెదులు
కాలిగజ్జెలు గదులు గలిగలా ధ్వనులా!
కోకిలా గొంతులా కుహూ కుహూ రవములను
మధుర గీతము పెడలు మాధవుని గీర్తింప!
విరిసినా పువుజూడ విభుడు దలపున మెదులు
కాలిగజ్జెలు గదులు గలగల ధ్వనులా!

సంజ వెలుగుల జూడ
జారినా చీకటిని!
నెమిలి పింఛముతోని నే జూతు నా విభుని!

నీలి మేఘముజూడ
నిండారు నా స్వామి!
మేని ఛాయగ జూతు మెఱుపు జేడియలలో!

తీపి పాటలు వినిన
తెరలి శ్రీకృష్ణునీ!
మురళీ స్వనములంచు మోదమున రమియింతు!

వివరింపలేను యీ
విపరీత వర్తనను
హరిని వరియించితిని! యందుకే యిటులయితి!

విరిసినా పువుజూడ! విభుడు తలపున మెదులు!
కాలిగజ్జెలు గదులు గల గలా ధ్వనులా!

## నవగీతముల తోని

నవగీతములతోని నన్ను బులకింపకే
తీయనీ కోకిలా! తేనె లొలుకుచునూ!
　　నందగోపాలునీ నామమును బలుకుచును
　　ఆనంద సుధల నన్నలరింపబోవకే!
నవగీతములతోని నన్ను బులకింపకే
తీయనీ కోకిలా! తేనెలొలుకుచునూ!

నీ పాట నే విన్న నిఖిలేశు డచ్యుతుడు
నా మనసులో నిలిచి నను జ్వాల దేల్చనే!
　　నవగీతములతోని నన్ను బులకింపకే
　　తీయని కోకిలా! తేనె లొలుకుచునూ!

విరహాగ్ని శిఖలచే వేదనను మునుగుతూ!
కన్నీటి నాలికేటి కాంతనే కోకిలా!
　　నవగీతములతోని నన్ను బులకింపకే
　　తీయనీ కోకిలా! తేనెలొలుకుచునూ!

చిగురు బూవులనితు! జిరుగజ్జియల నితు!
మావి తోటలయందు మధుర విందులజేతు!
నాముందు బాడకే నా విభుని శ్రీకృష్ణు
మోహాంబుధిని నేను మునిగిపోదును చెలీ!
నవగీతములతోని నన్ను బులకింపకే
తీయని కోకిలా! తేనెలొలుకుచునూ!

# పతి రాక

పతిరాక దెలుపుచూ పరగ వన వీధినీ
హంస చేడియ బలుక యలరి మది పొంగి!

గాలి కెరటాలలో గదులు బూదీవెలను
పులకించి దూగాడె బొలుపుగా నా మనసు

పతిరాక దెలుపుచూ పరగ వన వీధినీ
హంస చేడియ బలుక యలరి మది పొంగి!

విరిసినా వెన్నెలను
విప్పారు కలువలా!
నా మనసు మోదమున నాట్యాలు జేసింది!

హేమంతమున విరియు
చేమంతి పూవులా
సిగ్గు తెరలను గట్టి సింగార మొలికింది

హరివిల్లు లాగునా
యందాలు బూచినవి!
నవ వసంతమువోలె నాట్యాలు జేసింది!

నా చిన్నికృష్ణుడూ
నను గావ వచ్చునని!
మురళీ రవములందు మునిగి తేలుదునంచు!

పతిరాక దెలుపుచూ పరగ వనవధినీ!
హంస చేడియ బలుక! యలరి మది పొంగీ!

# విరహాన నా మనసు

విరహాన నా మనసు వేదనను పొందినది!
తీయనీ వేణువును దీరుగా వినగా!

హేమంతమున జారు హిమబిందువులవోలె
నా కనులు జార్చినవి నవభాష్ప బిందువుల!

విరహాన నా మనసు వేదనను బొందినది
తీయనీ వేణువును దీరుగా వినగా!

బృందావనము నందు
పొందుగా రాధతో!
చిందేటి యందాల సుందరుని గోరింది

మురళి నూదుచు జగతి
మోహాన ముంచుచూ!
అల మందలమధ్య యలరు గోపాలునీ!

జగములను బోషించు
యుగముల కర్తతునీ
కాల చక్రమునందు గలిసి యుండెడివాని!

అచ్యుతుని గోవిందు
నా పరంజ్యోతినీ!
తెలిమబ్బులాగు తన చేరువకు రమ్మనుచు

విరహాన నా మనసు వేదనను బొందింది!
తీయనీ వేణువును దీరుగా వినగా!

# పాటయందు విమలమైన

పాటయందు విమలమైన భావముగా-నా
పాటయందు విమలమైన రాగముగా!

నా మనసున నిలిచి నీవు నర్తనలే చేస్తావు!
సరిగమలను పలికి సుధల సరసత విరి యిస్తావు!

పాటయందు విమలమైన భావముగా! నా
పాటయందు విమలమైన రాగముగా!

మోహాన మురళిని నూరుచు
ముద్దుగ నా సరసనుండి!
ఏ లోకపు స్వరలయలనో
యింపుగ వినిపిస్తావు!

మాట మంతి లేక నేను
మౌన శిల్పమై పోవగ!
సరిగమలను పలికించెదు
సరసముగా నా తనువున!

గుహ లోపల నవరంగుల
కూర్మి చిత్రమై పోవగ!
చిన్ని గీతి నొక దానిని
జిఱు పెదవుల కందించెదు!

ఎన్ని పుణ్యములు జేసెనో!
యెన్ని నోములకు ఫలమో!
కన్న! నాదు పాట! నీదు
కన్ను కోరు కన్నె యయ్యె!



పల్లి నగోవి

## పున్నమీ చంద్రుడూ!

పున్నమీ చంద్రుడూ పుట్టెడూ కళలతో
నా విభుని నా యెదుట నయముగా నిలిపే!

తెల్లనీ వెన్నెలలు పల్లవించిన రాత్రి
సంగతులు మదిలోన జక్కగా దెచ్చెనూ!

పున్నమీ చంద్రుడూ పుట్టెడూ కళలతో
నా విభుని నా యెదుట నయముగా నిలిపే!

యమునా నదీ తీర యలల సొగసుల యందు
నీరజాక్షుడు నేను నిలిచి పాడిన పాట!
ఆ పాట పైకెగసి యంబరమునూ జుట్టి
భువికొచ్చు దృశ్యమును బూర్ణచంద్రుడు జూపె!

గోధూళి వేళలో గోప బాలురమధ్య
నను గోరి నను జేరి నా కరము బట్టగా!
మురళి నధరము జేర్చి ముద్దుగా దా బాడ
నే నాట్యమాడినా నిత్యోత్సవములనూ!

పొన్నచెట్టూ క్రింద వెన్నెలల రాత్రినీ
శ్రీ గంధమును నేను జిలకగా మాధవుడు!
పసుపు పారాణి నా పాదాల సొగసు గని
మెచ్చినా స్మృతి దెచ్చి హెచ్చించె వేదనను!

పున్నమీ చంద్రుడూ పుట్టెడూ కళలతో
నా విభుని నా యెదుట నయముగా నిలిపే!

# నవ్వాలా కాదమ్మ!

నవ్వాలా కాదమ్మ! పువ్వాలా కాదూ!
చిలకమ్మ శుభవార్త చేరి తెలిపినదీ!
చేసినా వ్రతములూ చేనందె ననుచునూ!
నా విభుడు వచ్చునని నయముగా దెలిపినది!

నవ్వాలా కాదమ్మ! పువ్వాలా కాదూ!
చిలకమ్మ శుభవార్త చేరి తెలిపినదీ!

కన్నీరు చేదుడిచి కజీగి తా మదియందు
విడిన కురులను ముడిచి విరులనూ తురిమినది!
కనుల కాటుక దిద్ది కలహంసి వలె జేరి
శ్రీ తిలక మద్దినది చెన్నుగా నుదుటనూ!

తా పోయినా పనియు దగ సఫల మాయెనని
విన్నవించిన వార్త విభుడు వినెనని తెలిపె!
రేపు మాపో వచ్చు దాపునకు విభుడంచు
చిలకమ్మ చల్లగా సింగార మొలికింది!

కనుల పండువుగాగ కాంతు నే గాంచెదను!
చెవుల విందువుగాగ శ్రీ మురళి విందునూ!
మనసార భజియించి మాధవుని జేబట్టి
జ్యోతిలో నే గలిసి ప్రీతి నొందుదు చెలీ!

నవ్వాలా కాదమ్మ! పువ్వాలా కాదూ!
చిలకమ్మ శుభవార్త చేరి తెలిపినదీ!

# మురళీ రవాలతో

మురళీ రవాలతో మురిపాలు జిందేవు!
కంటికగుపింపుమా! కనులార కృష్ణా!
ఆడిపాడీ నన్ను ఆనందవాహినిని
తేల్చుమా! ముంచుమా! తీయనీ స్వామి!
మురళీ రవాలతో మురిపాలు జిందేవు!
కంటికగుపింపుమా! కనులార కృష్ణా!

చిఱు గజ్జియలు మ్రోవ చిన్నారి నడలతో
నా యింటి ముందరను నటనాలు సలుపుమా!
కనులు మూసీ నన్ను గాఢముగ మెడజుట్టి
మోము మోమును జేర్చి మోదమును గూర్చుమా!

నిన్ను దొంగగ జేసి నీ కనులు నే మూసి
దాగుడుల నాడెడెదను దగ వేగ రమ్మనుచు!
కాళ్ళగజ్జియలాడి కల కలా ధ్వనులతో
ఐదములంటీ నేను ఐరవశము జెందుదును!

జన్మ జన్మల నాటి కర్మములు నెడబాయ
జోలబాడీ నిన్ను జో కొట్టెదను స్వామి!
చిన్ని పాదాలపై జేర్చుదును నా శిరము
కర్మబంధములన్ని కడ జారిపోవగను!
మురళీ రవాలతో మురిపాలు జిందేవు!
కంటికగుపింపుమా! కనులార కృష్ణా!

# దూరాన వనసీమ

దూరాన వనసీమ బాడేటి కోకిలల
తోరంపు పాట నీ పాటయని కృష్ణా!

మబ్బు చాటున మెఱుపు మధురమగు కాంతిలో
నీవు కదిలిన యటుల నీరజాక్షా! దలతు!

దూరాన వనసీమ బాడేటి కోకిలల
తోరంపు పాట నీ పాటయని కృష్ణా!

విరిసినా పూవులను విప్పారు పద్మముల
తూలుతూ పాడేటి తుమ్మెదల రాగాలు!
నీ వేణువని తలతు నే గూఢ శ్రుతిలయల
అందుకొందును గీతి యలరి నే నర్తనల!

గిరినుండి జారిపడి చింది శిలలను దాకి
జాలుగా ప్రవహించి సరసమగు ధ్వనులతో!
వినిపించు నాదాల విమలమగు నీ మురళి
స్వనములని భావింతు! స్వామి యిది నిక్కువము!

విశ్వమంతా నిండి విమలమగు ధ్వనులతో
వినిపించు మురళితో వేడుకను రమియించి!
కలిసిపోవాలనీ కమ్మనీ రాగాల
పాటగా నే మారి పరవశించాలనీ!

దూరాన వనసీమ బాడేటి కోకిలల
తోరంపుపాట నీ పాటయని భ్రమియింతు!

# నా ముద్దు చిన్నారి

నా ముద్దు చిన్నారి! నా మనసు చిటిపాప!
నిను బిలుచుచున్నదోయ్! నిఖిల లోకేశా!
    మధుర భావములతో మంజులంబగు గీతి
    వినిపించు చున్నదోయ్! వేణుగోపాలా!
నా ముద్దు చిన్నారి! నా మనసు చిటిపాప!
నిను బిలుచుచున్నదోయ్! నిఖిల లోకేశా!

మనసు తనకూ తానె మధురమగు భావాలు
సృజియించుకున్నదీ చిత్రచిత్రముగా
తీయనీ పదములను దీరుగా నెన్నుకొని
నవగీతి దీర్చినది నా చిన్ని మనసూ!

నిను పతిగ భావించి తను సతిగ నూహించి
నిను జేరదలచినది నీటు కత్తియ గాక!
లయ తాళ రాగముల లలిత స్వరనలితో
విరహగీతిక బాడి విలపించు గోపాల!

జన్మ జన్మలనాటి మర్మముల దెలుపుతూ
తను దాసినని జెప్పి తగ నీవు స్వామివని!
మురళీ స్వనమ్ములందు ముద్దుగా జేర్పుమని
వేడుకొనుచున్నదీ! విలపించు చున్నదీ!

నా ముద్దు చిన్నారి! నా మనసు చిటిపాప
నిను బిలుచు చున్నదోయ్! నిఖిల లోకేశా!

## సుకుమార నాదాల

సుకుమార నాదాల సుందరంబగు మురళి
ఒకసారి పాడవా వికసింప మనసూ!

అందాల వనవీధి యలరేటి నెమ్మిగా
నే నర్తనల జేతు నిండు మనసున కృష్ణ!

సుకుమార నాదాల సుందరంబగు మురళి
ఒకసారి పాడవా వికసింప మనసూ!

మనసులో మొలిచినా మధుర భావాలనూ
గీతిగా బాడుదును గిరులు ప్రతిధ్వనియింప!
శిలలన్ని కదలికల చిన్నారి బొమ్మలయి
మధుర శిల్పము లటుల మధురిమలు వెదజల్లు

తరులన్ని పులకించి తన్మయము జెందగా
లతలన్ని పువ్వులను లాలిత్య మొలకగా!
చిలుక గోరింక లలి చింద వాయిద్యములు
పాటబాడుదు ప్రకృతి పరవశము జెందగా!

నీ మురళి నాదాల నా పాట జతజేయ
సృష్టి యందాలకే శోభనము గలిగించు!
చరణదాసిని స్వామి! చిరకాల వాంఛితము
మనసార కరుణించి మాధవా! ప్రోయింపు!

సుకుమార నాదాల సుందరంబగు మురళి
ఒకసారి పాడవా వికసింప మనసూ!

# ఎంత ప్రేమో

ఎంత ప్రేమో! మాధవునకూ!
ఇంతిరో! నే దెలుపలేనూ!

అంతరంగమునందు నిలిచీ
చింతలన్ని తొలగజేయును!

ఎంత ప్రేమో! మాధవునకూ!
ఇంతిరో! నే దెలుపలేనూ!

కాఱు నలుపులు గటిక చీకటి
కనుల ముందట నిలిచినపుడూ!
కాంతి కిరణము గనుల నిలిపీ
కమ్మనీ దారులను నడుపును!

అలలలో బడి సుడుల తడబడి
పలవరించే సమయమందున!
బ్రతుకు నావను భద్రపరచీ
పదిలముగ వే దరికి జేర్చును!

మాటరాకా! పాటరాకా!
మౌనమును ధరియించినపుడూ!
చిలుక కోకిల పలుకు పాటను
జేర్చ యానందమును గూర్చును!

చింత దీర్పక యింత ప్రేమను
జిందగా నీ కేలనో యన!
చిన్ని నగవును జిందికృష్ణుడు
శీఘ్రముగ యెటొ మాయమగునూ!

పి లు పు ట

## రావె! నా యుపరంజి!

రావె! నాయుపరంజి! రమణీయ గీతమా!
చిన్నికృష్ణుని బాడు చిన్ని గీతమునూ!
తీయగా దీరుగా దేనెలొలికే పాట!
సరిగమల రాగాల చల్లగా మెల్లగా!
రావె నాయుపరంజి! రమణీయ గీతమా!
చిన్నికృష్ణుని బాడు చిన్ని గీతమునూ!

ఆనాటి వెన్నెలల
అలరాస క్రీడలను!
అందెలకు సాటిగా యలరారు నటులుగా!

కరతాళ ధ్వనులతో
కమ్మవీ శ్రుతిలయల!
మురళీ స్వనంబులకు ముద్దుగూర్చిన రీతి!

పడవపై పయనించి
ప్రభు సన్నిధిని జేరి!
అంజలిని ఘటియించి యాత్మార్పణముజేసి?
నను జేర్చుకొనుమనీ
నాట్యాలు జేయుచును!
తీయగా బాడు మొక తేనె లొలికే పాట!

రావె! నాయుపరంజి! రమణీయ గీతమా!
చిన్నికృష్ణుని బాడు చిన్ని గీతమునూ!

# వెన్నెలా సొగసుల్లో

వెన్నెలా సొగసుల్లో విరిసినా కిన్నెరగ
ఎన్నొ పాటలు పాడి యింపు గులికితివీ!
గొంతెత్తి ఒక పాట కోకిలకు వలె పాడు
నా హృదయ నాదమా! నాకంత ప్రాణమా!
వెన్నెలా సొగసుల్లో విరిసినా కిన్నెరగ
ఎన్నొ పాటలుపాడి యింపుగులికితివీ!

మదియందు పులకించి హృదియందు వికసించి
పూలరెమ్మకువోలె సొలుపులను గులికితివి!
గాలి తెమ్మెరలలో కదిలి బయలంతటిని!
పూల వాసనలతో బులకించితివి గదే!

ఎన్నెన్నొ రాగాలు! ఎన్నెన్నొ గీతాలు!
మింటి చుక్కలకువలె మిల మిలల నొలికితివి!
ఆ గీతమది యేది? అ రాగమది యేది?
నూరేండ్లు నిండెనా నోము ఫలమింతేన?

ఏ రాగమునవైన యే గీతి పాడినా
చిన్నికృష్ణుని గూర్చి చిత్రముగ పాడేవు!
మౌనముద్రను దాల్చి మాటాడకుంటి వదె!
ఆరినా దీపముగ యంతమయి పోతివా!

వెన్నెలా సొగసుల్లో విరిసినా కిన్నెరగ
ఎన్నొ పాటలుపాడి యింపు గులికితివీ!

## చివురులా చెన్నొందు

చివురులా చెన్నొందు జిన్నారి శ్రీకృష్ణ!
నాముందు నడయాడు నవమోహనాంగా!

మోహనంబగు మురళి ముద్దుగా బాడుచూ
ఆనంద సుధలలో నలరింపుమా నన్ను!

చివురులా చెన్నొందు చిన్నారి శ్రీకృష్ణ!
నాముందు నడయాడు నవమోహనాంగా!

చిట్టిపొట్టి యడుగులను
జిఱు గజ్జియలు మ్రోవ!
నర్తనలు సేయుమా నాయింటి ముంగిటను!

కోటియందాలు గల
కోమలాంగుడ వీవు!
హత్తుకొని హృదయాన యందాలు జూచెదను!

చంకనెత్తుక నిన్ను
సఖి నంచు దెలిపెదను!
వక్షమున జేర్చుకొని వగలు బోవుదునూ!
మురిపాలు జిందేటి
మోము ముద్దాడుచును!
నీ చిన్ని మోములో నే లీనమయిపోదు!

చివురులా చెన్నొందు జిన్నారి శ్రీకృష్ణ!
నాముందు నడయాడు నవమోహనాంగా!



పెల్లి నగ్రోవి

## మనిషి మనసే నీకు

మనిషి మనసే నీకు మందిరంబయి యుండ
కొండ కోనలలోన కోవె లెందులకూ?
  నీ మురళి వినిపింప నీటుగా మానవుని
  మధురార్ద్ర హృదయమే మందిరంబగు గాద!
మనిషి మనసే నీకు మందిరంబయి యుండ
కొండ కోనలలోన కోవెలెందులకూ?

ఆత్మ పరమాత్మలా యంతరంబులు దెలిపి
ప్రత్యగాత్మ నటంచు బ్రకటింపలేదా?
అంతటా నీవెయని యఱచి పలికిన నరుని
ఆత్మ స్వరూపుడని యాదరింపగ లేద?

జగతి జీవులయందు జ్ఞాన భాస్కరునిగా
మానవుని సృజియించి మన్ననను జేసితివి!
తీయనీ కళలతో దీరుగా నినుజేర
బంగారు పూలతో బాట కల్పించితివి!

నేను నీవేయంచు నీవు నేనే యంచు
అఖిల జీవులలోని యంతంబొకటనీ!
మమత శాంతీ కాంతి మానవునిలో నుండ
ఆదరింపవదేమి? అదియేమి చిత్రమో!

మానవుని మనసులో మధురముగ గూర్చుండి
మధుర మురళిని నూదు! మనసు లుప్పొంగగా!
సమత మమతా శాంతి సర్వ జగతిని నింపి
వసుధైక గృహముగా వర్థిల్ల జేయుమా!

## అల్లంత దూరాన

అల్లంత దూరాన యగుపడక శ్రీకృష్ణ!
మురళి మ్రోయించేవు మోదమును జిందా!

నా మనసు పులకించు నవరాగములతోని
తీయనీ గీతమై తేజరిలు మదియందు!

అల్లంత దూరాన యగుపడక శ్రీకృష్ణ!
మురళి మ్రోయించేవు మోదమును జిందా!

భానుడుదయించేటి భవ్యోదయమునందు
దూర్పు దిశయంతటను దొలుకాడు గుంకుమలు!
నిను జూడకనె నేను నీ మురళి విన్నపుడు
నా మనసు వికసించి నవ గీతమును బాడు!

చంద్రుడొచ్చే వేళ వెన్నుగా దూగాడి
కలువ కాంతలు విరిసి కాంతులే విరజిమ్ము!
నీ మురళి స్వనములే నీటుగా విన్నపుడు
నా మనసు పూర్ణమై సవ్యశోభలు నిండు!
వెన్నెలను నేముంచా! వేడుకను నీ మురళి
రవములను నే ముందొ! రమ్యమగు సొగసులూ!
అణువణువు నందమై యలరారు నీ జగతి!
కోటి దీపాలతో గూడినట్లనిపించు!
అగుపడక యుండినా యల్లంత దూరాన
మురళి మ్రోయించుచును మోదమును వర్షింప
నిన్ను బొందేవరకు నిత్య సౌభాగ్యముగ
కమనీయ నీ మురళి గానమును నే విందు!

## సరిగమలు - పదనిసలు

సరిగమలు! పదనిసలు! సప్తస్వర ములార!
నిలువుడో నా హృదయ నిర్మలాంతరమూ!

పలుకుడీ! జవులూర పద్మములు విరిసినటు
సరస సాహిత్యముల సాంగత్యమును జేసి!

సరిగమలు పదనిసలు! సప్తస్వరములార!
నిలువుడో నా హృదయ నిర్మలాంతరమూ!

చెవులకింపును గాగ చిత్తమును హరియింప
మంజులంబుగ చింది మదియందు హత్తుకొని!
పదములో నున్న యా భక్తి రక్తిని గూర్చి
విశదబఱచీ సుథల విమలతను గూర్చుడీ!

సరిగమలు! మీరాగ సరసత్వమును గోరి
గోపాల బాలునీ గూర్చి బాడుచు నుంటి!
పదములను మీరుండి భావ గంభీరతను
లలిత లాలిత్యముల రంజింప జేయుడీ!

రాగమాధురి నొలికి రంజిలగ నా పాట
విమల గాంధర్వమున వీధులను బాడాలి!
నిత్య నూతనముగా నిర్మలాత్మలయందు
సరిగమలుగా విరిసి సరసత్వ మొలికాలి!

ఉదయ సంధ్యలకు వలె నూహలను మెదలాడి
మలి సంధ్యలకు వోలె మధురిమల నొలకాలి!
భావమున మెదలాడి పలుకులను కదలాడి
మురళీ స్వనములవలె మోదమును గూర్చాలి!

పి లు పు లు

## మావి కొమ్మలపైని

మావి కొమ్మలపైని మధురముగ బాడేటి
కోకిలా! రావమ్మ! కోరికను దీర్పా!

నా పతిని నను గూర్చి నా బ్రదుకు దరిజేర్చి
నవగీతమును బాడు నవ వసంతమునందు!

మావి కొమ్మలపైని మధురముగ బాడేటి
కోకిలా! రావమ్మ! కోరికను దీర్పా!

నీ పాట వినగానె నిఖిల లోకం బంత
తీయనీ ప్రేమతో దేనె లొలుకనుగాద!
ఒక పాట బాడుమా! ఒయ్యార మొలికించి
దరిజేరగా సఖుడు ధన్యాత్మ నయ్యెదను!

ఏడేడు జన్మలా యేకాంతముగ నేను
పాడు చుంటిని విభుని పతి విరహ గీతికను!
ప్రేమ లొలికేటట్లు ప్రీతి పొంగేటట్లు
పాడుమా కుహూ కుహూలు పరవశము జెందగా!

ఈ వసంతమునందు నీ మధూమాసాన
నీకెవరు సాటెవరు? నిఖిల జగమందునా?
కమ్మనీ కంఠాన కలికి కోకిల! పాడి
నా విభుని నను గూర్పు నలువురూ కొనియాడ!

మావి చివురుల విందు మధురముగ జేయింతు!
సెలయేటి నీరములు జెలులతో దెప్పింతు!
రాణిగా జేయింతు రమ్య ప్రకృతి కంత!
పంకజాక్షుని గూర్చి పతిభిక్ష పెట్టవే!



పిల్లి నగ్రోవి

## మనసులో కోరికను

మనసులో కోరికను మల్లియలు జేర్చినటు
మధురాక్షరములలో మనవి జేయుదునూ!
నీపైని నా ప్రేమ నిలిచినది నిండుగా
నిముసమైనా నేను నిలువజాలను కృష్ణ!
మనసులో కోరికను మల్లియలు జేర్చినటు
మధురాక్షరములలో మనవి జేయుదునూ!

జపములను తపములను
సలుపజాలను స్వామి!
మధుర భక్తిని మెచ్చి మన్నింప మనుచుంటి!

నీ మురళిచే గటిగి
నే దాసినయి పోతి!
నీ రాసక్రీడలో నే గోపికను నైతి!

అణువణువు ప్రకృతిని
యందాల ప్రోవులో!
నే గలిసి పోవగా నిండయిన యాశగా!
నీ మురళి స్వనములను
నీటుగా నే నొక్క—
రాగమైపోవగా రమణీయమగు కోర్కె—!

మనసులో కోరికను మల్లియలు జేర్చినటు
మధురాక్షరములలో మనవి జేయుదునూ!

## మధుర గీతికలతో

మధుర గీతికలతో మాటి మాటికి బిలువ
మాటయిన బలుకగా లేవా? శ్రీకృష్ణ!
మనసు తీపిగ జేయలేవా? శ్రీకృష్ణ!
మనసు తీపిగ జేయలేవా?

ముద్దు మోమొకసారి మోదమున జూపుమని
చెయిజాచి నిన్నడుగ లేదా? నా కృష్ణ!
చెంతరమ్మని బిలువలేదా? నా కృష్ణ!
చెంతరమ్మని బిలువలేదా?

తీయనీ వేణువును దేనె లొలికించుచూ
సుధల దేల్పగ బిలువలేదా? శ్రీకృష్ణ!
మధురబాసలు జేయలేదా? నా కృష్ణ!
మధుర బాసలు జేయలేదా?

చిఱు గజ్జియలతోని జిందుచూ నాట్యాలు
నా యెదను నిలువమనలేదా? శ్రీకృష్ణ!
నవరసము లొలుక మనలేదా? నా కృష్ణ!
నవరసము లొలుక మనలేదా?

గిరినుండి పెల్లుబికి ధరిణి నంటే ఝరిగ
పులకింపమని వేడలేదా? శ్రీకృష్ణ!
పూర్ణమున కలుపమన లేదా? నాకృష్ణ!
పూర్ణమున కలుపమన లేదా?

# చిన్నికృష్ణుని మురళి

చిన్నికృష్ణుని మురళి చేటు దెచ్చినదమ్మా!
నను దూరదేశాల నాతి! తరలింపవే!

మురళి విని విని నేను మోహమున మునిగితిని!
అలత కలతలనుండి యాదుకొనవే సఖీ!

చిన్నికృష్ణుని మురళి చేటుదెచ్చినదమ్మా!
నను దూర దేశాల నాతి! తరలింపవే!

మధుర నాదాలతో నను ముంచి నను దేల్చి
అందాల మేఘాల నలనల్ల ద్రిప్పునే!
కనుదెఱచి నే జూడ గనపింపడో సఖీ!
ఎద పొంగి యేఱగును ఎట్లోర్తునే నేను?

కమ్మనీ వెన్నెలల కాంత నే గూర్చొనగ
మారు మూలల విందు మధుర మురళీ ధ్వనులు!
ఏ మూల జూచినా యెఱుకపడదో యమ్మా!
మది మండుటెండగా మసిలిపోవును చెలీ!

పిల్లనాగ్రోవి యా పిలుపు లిక వినకుండ
నను దూరద్వీపాల నాతి! వేగొనిపొమ్మా!
అప్పుడయిన నా స్వామి యాదరించునో యేమొ!
తీయనీ తన హృదిని జేర్చుకొనునో యేమొ!

చిన్నికృష్ణుని మురళి చేటుదెచ్చినదమ్మా!
నను దూరదేశాల నాతి! తరలింపవే!

## ప్రేమపల్లెవాడలో

ప్రేమపల్లెవాడలో గోపకన్నియ నేను!
నీటుగా బాడితిని నీ మురళి పాట!

నీవు మఱచితివేమొ! నే మఱువలేనోయి!
ఆ రాసక్రీడలను ఆ మధుర రాత్రులను!

ప్రేమపల్లెవాడలో గోపకన్నియ నేను
నీటుగా బాడితిని నీ మురళి పాట!

మురళి పాటలను విని మోహమున యిలు విడిచి
యడవులన్నియు దాటి యందుకొంటిని నిన్ను!
ఆకాశ మల్లియల యందాల పూదండ
కంఠమున వేసినా కలహంసినీ నేను!

నీ మురళి స్వనములను నీటుగా నే బాడి
నీ మెప్పు బొందినా నీటుగత్తియ నేను!
యమునా తరంగిణిని యమళ జలకములాడి
వ్రతమాచరించినా వ్రజభామినిని నేను!

ఎన్ని జన్మము లటుల విన్నపములను విడుచు
కనులలో దయరాదు; గడిగిపో వెందుకో!
మాలవేసి నీకు మనసు నర్పించితిని!
అప్పటికి యిప్పటికి యెప్పటికి పతి వీవు!

ప్రేమపల్లెవాడలో గోపకన్నియ నేను!
నీటుగా బాడితిని నీ మురళి పాట!

## కోయిలొచ్చిందమ్మ !

కోయిలొచ్చిందమ్మ! కోయిలొచ్చింది!
కొత్త సంవత్సరపు కోడలొచ్చింది!
తీరయిన గొంతుతో తీపిపాటలతోని
మావి కొమ్మల చాటు మరులు కొలిపింది!

కోయిలొచ్చిందమ్మ! కోయిలొచ్చింది!
కొత్త సంవత్సరపు కోడలొచ్చింది!

చెట్లన్ని చిగురించి లీగెలన్నియునూ
చిని చిన్ని పూలతో జిందులాడినవీ!
వనమంత పరిమళము వన్నెలొలికింది!
చల్లనీ గాలులూ సరసమాడినవీ!

కొత్త దంపతులకూ కోరికలు తొలికే!
మధుర భావాలతో మనసులలరించే!
కవుల కవితల సాగె కమనీయ గరిమా!
ఆకాశ వీధిలో అందాలు మెఱిసే!

వచ్చింది తెలుసులే వయ్యారి భామా!
చిన్నికృష్ణుని జాడ దెలిసికొంటివిగా!
నా పతికి నా కోర్కె నయముగా దెలిపీ
వచ్చినా నీ కివే వందనము చెలియా!

సరస సాహిత్యమున సంగీత ధ్వనులా
వినిపింపు కోకిలా విభుని శుభవార్తా!
అణువణువు నే పులక లలరగా చెలియా!
ఆనంద సుధలలో నాహ్లాద మొందా!

# కొంతకొమ్మనను

కొండ కొమ్మనను గూరుచుంటినీ!
కోరిన కోరిక దీర్పుమనుచునూ!
అడుగడుగున నొక పాటపాడమని
అంచమొప్ప రమ్మనుచు గోపాలా!
కొంతకొమ్మనను గూరుచుంటివీ!
కోరిన కోరిక దీర్పుమనుచునూ

మధుర వసంతము విరిసే దొకపరి
మావికొమ్మలూ పూచేదొకపరి!
మంజుల స్వనముల మధుర కోకిలలు
పాడే దొకపరి ప్రణయ గీతమును!

పూర్ణచంద్రునీ పున్నమి వెన్నెల
పులకల దేల్చే దొకనాడే రవి!
సంజకెంపులవి తొంగిచూచుటది
సరసమాడవుగ దినమంతయును!

అడుగడుగుననూ పాటపాడగా
ఆటకత్తియను గాదుగదా! నే
పంతముతో నను బలుచన జేయకు
ప్రణతులు గైకొని రమ్ము! వేగమున!
ఎంత పాడినా నా గొంతుకతో
సుంతరాదు నీ మోహన మురళిని!
అధరమందు నా మురళిని జేర్చి
అందమొప్ప నొక పాట పాడుమా!



పిల్లి న గ్రోవి

# మధురమైన నీ మోహన మురళి

మధురమైన నీ మోహన మురళీ
మంజుల స్వనములు ఎంత తీయనో!
వేయి కోకిలలు పాడిన తీరున
వేయి దీపములు వెలిగిన విధమున!
మధురమైన నీ మోహన మురళీ
మంజుల స్వనములు ఎంత తీయనో

హంసల గుంపుల నడకల సొంపులు
అందెల రవళులు మ్రోగిన చందము!
విచ్చిన పువ్వుల తేనెల త్రావుచు
వేయి తుమ్మెదలు గలిసి పాడినటు!

కలువలు నిండిన కొలను గట్టుపయి
పూచిన పూవుల పొదల దీగెలను!
మంచు బిందువులు రాలుచు జేసెడి
మధుర స్వనములేమో యనిపించును!

చీకటి తెరలను తెలతెల జేయుచు
చెన్నారెడి నవ సంధ్యా కాంతులను!
విరిసే రంగులు కురిసే రాగము
నీ మురళీ స్వనములు యనిపించును!

అధరమునందున మురళిని నిలిపి
అంతరంగమున యభినయ మాడుచు!
పాట పాడగా పరవశమై నే
పాలసంద్రమున యలనై పోదును!

## మనసున వెన్నెల

మనసున వెన్నెల పూచిందీ! నా
మనసున రాగం వెలిసిందీ!

తీయని భావాలలలు తెరలుగా
తేనెల వాకలు సాగినవీ!

మనసున వెన్నెల పూచింది! నా
మనసున రాగం వెలిసింది!

తొలిసంధ్యల చిఱుకాంతుల యరుణిమ
తూగుటుయ్యాలగ నూగిందీ!
పిల్ల తెరల నా గీతము దేలుచు
పిల్లనగ్రోవిని వెదికిందీ!
ఎచ్చటివీ యీ మురళీ స్వనములు?
ఎచ్చటివీ యీ మధుర వీచికలు?
నా యెదలో జిగురాకులు దొడిగీ
నవ్య వసంతము వెలిసిందీ!

కంటి కగపడక కమ్మని మురళీ
కలకల నాదము వినిపించిందీ!
నా మదిలోపల నవ్యభావములు
నాట్యమాడె నొక మధుర గీతమై!

నీ మురళి స్వనములు వినిపించును
నే బాడుదు నీ భక్తి గీతమును!
జనన మరణముల భ్రాంతి చక్రమిటు
కదిలిపోవు టిది యెంతకాలమో!

## నా విరహ వేదనను

నా విరహ వేదనను నాథునకు దెలుపుమని
యంపినా మేఘమది యటుపోయెనో లేదా!

దారిలో నాగెనో దరిదాపులేదనుచు
మఱచిపోయెనా యేమొ! మదిలోని నా మాట!

నా విరహ వేదనను నాథునకు దెలుపుమని
యంపినా మేఘమది యటుపోయెనో లేదా!

మనసు నీ కిచ్చితిని మాధవా! రమ్మనుచు
కన్నీటి ధారలను కమనీయ పదములను!
వ్రాసినా పత్రికను వయ్యారి మేఘముల
నందింపుమని యంటి యలరి నా నాథునకు!

అంపినా మేఘమది యటుపోయెనో లేదా!
అంచకన్నెలగూడి యాటలను మునిగెనో!
విని నాదు వేదనను విభు డాలసించెనో!
మమత చిగురింపదో! మఱి దయలు పొంగవో!

రాత్రిబవళులు నీదు నామమును దలచుచును!
చింతచే జివుకుచును జివురాకునై పోతి!
రాలేటి పువ్వుగా రవరవలు బడుచుంటి!
చివరి పిలుపునైన జిందుమా! దయ యనుచు!

మేఘముల యననేల? మెఱుపులను నననేల?
నను మఱచె నా విభుడు నలుసంత దయలేక!
నా నోము ఫలమింతె! నా పూజఫలమింతె!
పరుల నననేల? నా భాగ్యమును నిందింతు?

## అడుగకే గోరింక

అడుగకే గోరింక! ఆత్మనాథుని గూర్చి!
దూరదేశాన నే దురపిల్లుచుంటి!

విభునిపై నేనలిగి విడిపోతినే చెలియ!
వేయి మాటలవేల? విభుడు నను మఱచెనే!

అడుగకే గోరింక! ఆత్మనాథుని గూర్చి
దూరదేశాన నే దురపిల్లుచుంటి!

విభుని నే గలియగా
వేయి గీతములతో!
రోదించుచుంటినే రోదసీ ధ్వనియింప!

నా వినతులను వినీ
నన్ను మన్నింపుమని
హంస చేడియలతో నంపితిని లేఖలను!

నా నోము ఫలియించి
నను బ్రోవ జనుదెంచి!
వేణువును మ్రోగించి వేదనను మాన్పునో?

నీవయిన ఒకసారి
నిండయిన మనసుతో
నా నాథుడొచ్చునని నయముగా బలుకవే!

అడుగవే గోరింక! ఆత్మనాథుని గూర్చి
దూరదేశాన నే దురపిల్లుచుంటి!

## కోకిలా! గొంతెత్తి

కోకిలా! గొంతెత్తి క్రొత్త గీతముబాడి
నానాథు రాకనూ నయముగా దెలుపూ!

ముఠళి చే ధరియించి ముద్దుగా బాడేటి
జగదేక సుందరుని జాడలను దెలుపవే!

కోకిలా గొంతెత్తి క్రొత్త గీతముబాడి
నానాథు రాకనూ నయముగా దెలుపూ!

మావి కొమ్మలపైని మధురముగ గూర్చుండి
తీయగా బాడవే
తేనెలను వర్షించి!

కోకిలా గొంతెత్తి క్రొత్త గీతము బాడి
నా నాథు రాకనూ నయముగా దెలుపూ!

నవ్యభావాలతో నవ పదములను గూర్చి
చిన్ని కృష్ణుని బాటె
తేనె లొలికింపవే!

కోకిలా గొంతెత్తి క్రొత్త గీతము బాడి
నానాథు రాకనూ నయముగా దెలుపూ!

ఆత్మనాథుని గలియ యారాధనలనుంటి
నాథురాకను దెలిపి
నను దేల్పవే సుధల!

కోకిలా గొంతెత్తి క్రొత్త గీతము బాడి
నానాథురాకనూ నయముగా దెలుపూ!

## అంజలి నున్నా

అంజలి నున్నా పూవుల నెవరికి
యర్పింతును శ్రీ గోపాలా!
మనసున వెలిసిన మధుర గీతమును
మఱి యెవరికి వినిపింతును స్వామీ?
అంజలి నున్నా పూవుల నెవరికి
యర్పింతును శ్రీ గోపాలా!

అంజలి గొనుమని యర్చన గొనుమని
పాడుచుంటిగా పరవశమందుచు!
ముందు వెనుకలను ప్రక్కల దాపున
అందముగా నీ వలరియుండువని!

మనసులోపలా మనసయిపోతివి!
కన్నుల లోపల కలిసిపోతివీ!
రాత్రింబవళులు నను బాధించుచు
రవరవలను నిటు జేయుట దగునా?

దాసిని గద! నను దయగొను స్వామీ!
అఖిలేశ్వర నీ యణువును గాదా!
పాటను విని నా బంధము ద్రెంపుము
అంజలిగొని నన్నాదరింపుమా!

అంజలి నున్నా పూవుల నెవరికి
యర్పింతును శ్రీ గోపాలా!

## కన్నీరు జాలుగా

కన్నీరు జాలుగా కలకలా నాదముల
సెలయేటిలో గలిసె చిత్రముగ కృష్ణా!

రావేమి నా స్వామి! రయముగా నను బ్రోవ!
తీయనీ మురళితో తేనెలను వర్షింప!

కన్నీరు జాలుగా కలకలా నాదముల
సెలయేటిలో గలిసె చిత్రముగ కృష్ణా!

చిందినా కన్నీరు
చిత్రమగు గాథ విని!
సుడులుగా దా దిరిగె సోలుతూ సెలయేరు!

విరహ వేదనను విని
వేమారు ప్రశ్నించి
సెలయేటి యలలన్ని విరిగి యొడ్డున జేరె!

చిఱుచేప కన్నియలు
జింతలను మునుగుచూ!
ఎదురీతలను మాని విస్తుపోయినవి గదా!

తెరచాప గూడ దా
తెరలి యటు నిటు కదిలి
గాలి కెరటాలలో గలవరము బడినది!

నీకు దయ లేదుగా
నీరజాక్ష! రవంత!
జ్యోతి జ్యోతిని గలిపి ప్రీతి సేయుము స్వామి!

## అలనాటి గోపికను

అలనాటి గోపికను నేనుగదా! గోపాల!
అలగోపకాంతనూ నేను గద కృష్ణా!

తీయనీ పాటలను దీరుగా మనసిచ్చి
మనసువోచిన గోప మధుర వాణిని నేను!

అలనాటి గోపికను నేను గద గోపాల!
అలగోపకాంతనూ నేను గద కృష్ణా!

రాస క్రీడలయందు
రంగుగా దిరుగుచును!
నీ మెప్పు బొందినా నీటు కత్త్రియ నేను!

నీ మురళి స్వనములను
విలిచి నాట్యము జేసి!
పాట బాడినయట్టి పద్మ గంధిని నేను!

అలనాటి వ్రేపల్లె
యతివలందఱి యందు!
నను వెదుక వాడవుగ నాట్య గీతములకూ!

ఇపుడు వెదుకుచునుంటి
ఇన్ని జన్మలు నిన్ను!
దయజూపి గోపాల దర్శనంబీయవా!

అలనాటి గోపికను నేను గద గోపాల!
అలగోపకాంతనూ! నేను గద కృష్ణా!

# ఎన్నాళ్ళు ఈ విరహమో!

ఎన్నాళ్ళు ఈ విరహమో! చిన్నికృష్ణా!
ఎన్నాళ్ళు ఈ వేఱుబాటులో మనకూ!

మాటి మాటికి నీదు మధుర మురళిని వినుచు
తీయనీ వేదనల దేలుచెన్నాళ్ళో!

ఎన్నాళ్ళు నీ విరహమో! చిన్నికృష్ణా!
ఎన్నాళ్ళు ఈ వేఱుబాటులో మనకూ!

నీ యధరమున నున్న
నీటయిన మురళి విని!
నా మనసు శ్రుతిలయల నవగీతమును బాడు!

నీవు బాడిన మురళి
నిండి నా మది యందు
లయతాళములతోని నర్తనలు గావించు!

మధురమగు భక్తి యిటు
మనసులో నుప్పొంగి!
ఏఱులై వాగులై యేల ప్రవహించునో!

మనసులో నున్న నిను
మఱతునెటు దెర వేసి!
వెంటనున్నా నిన్ను వేఱుజఱతును కృష్ణ!

ఎన్నాళ్ళు ఈ విరహమో చిన్నికృష్ణా!
ఎన్నాళ్ళు ఈ వేరుబాటులో మనకూ!

## మెత్తని పదముల

మెత్తని పదముల క్రొత్త గీతముల
చిత్తములో జిగురింప జేయుమా!
క్రొత్త రాగములు గోరిక దీరగ
ఎత్తిన ధనువుగ చిత్రించెదనూ!
మెత్తని పదముల క్రొత్త గీతముల
చిత్తములో జిగురింప జేయుమా!

చివురుల పువ్వుల జీవన రాగము
వన్నెల చిన్నెల జేర్చి పాడెదను!
ఆకురాలు శిశిరములా పొగులుచు
యార్తనాదమున శోకము జిందుదు!

తీయని వెన్నెల శారద రాత్రుల
తేలుచు బాడెద శశి బింబములా!
కంటిచుక్కలను హిమబిందువులుగ
మింటిని మంటిని దడుపుచు బాడెద!

పొగలు సెగలుగా జ్వాలలు రేగుదు
రగులు గ్రీష్మముగ విరహము జిందుదు!
సరితలు ఝురులూ పొంగి పొరలునటు
హర్షభాష్పములు గురియుచు బాడెద!

క్రొత్త పాటలను నెన్ని పాడినను
కోమలమగు నీ మోహన రూపమె!
నా యెద యందున చిందిన నాట్యమె
నవ్యభావముల నవగీతములూ!

# ఏ వస్తువును గనిన

ఏ వస్తువును గనిన యేది భావించినా
అందాల నీ రూప మలరు శ్రీ కృష్ణా!

నింగి నీలమునందు నిలిచినా మబ్బొకటి
అటు కదిలి యిటు కదిలి యాకార మగునటుల!

ఏ వస్తువును గనిన యేది భావించినా
అందాల నీ రూప మలరు శ్రీ కృష్ణా!

అందాల తారలను
చందమామను గనిన!
రాసక్రీడల నాటి రమణుగా భావింతు!

సంధ్య కాంతులు తోచు
సరస గోపికలుగా!
బాలభానుని దలతు బాలగోపాల నిను!

వనవీధి గోకిలలు
మనసు బొంగగ పాడ!
నీ మురళి స్వనములని నిఖిలేశ భావింతు!

ఏ మాయ జేసితో
తెలియగ లేనోయి నే!
మైకమున నను ముంచి మాయజేసితివోయి!

ఏ వస్తువును గనిన యేది భావించినా
అందాల నీ రూప మలరు శ్రీ కృష్ణా!

## మాట మంతీ లేక

మాట మంతీ లేక మౌనముందామంటె
మనసులోని మాట మాటి నిలువదెందుకో!
క్రొత్త కోరికలతో కోట పేటల దాటు
ఆకాశ హర్మ్యాల యంచులను దిరుగాడు!
మాట మంతీ లేక మౌనముందామంటె
మనసులోని మాట మాటి నిలువదెందుకో!

నీ చరణదాసినై నిలిచి యుండాలనుచు
మదికోర్కె తనలోనె మధుర యూహాల మునుగు!
నింగి నీలిమునందు
నీతోని విహరించి
ఉయ్యాలలూగినటు నూహాలందున మునుగు

మిసిమి సంధ్యలయందు సినుక తెన్నెలయందు
కొండ కోనలయందు గోకిలలు పాడగా!
నీ చేతి నందుకొని
నే పులకరించినటు!
మధుర గీతము పాడి మాధుర్య మొలికినటు

నీ కోర్కెయేగాని నా కోర్కె కాదుగా
నా మదిని నిలిచియుటు నాట్యమాడించుటలు!
నీ ప్రేమ దొంతరల
నిలువ లేనుర కృష్ణ!
నా మనసు చిన్నదే! నాథ! వేధింపకుము!

## నా నీడ జూచుకొని

నా నీడ జూచుకొని నాతి భ్రమలొందుదును!
నందగోపాలుడే నా వెనుక వచ్చెనని!
    పంజరములో జిలుక పలుకగా జెలియరో!
    పంకజాక్షుడె ప్రీతి బలికెనని యనుకొందు!
నా నీడ జూచుకొని నాతి! భ్రమలొందుదును!
నందగోపాలుడే నా వెనుక వచ్చెనని!

చల్లని వెన్నెలను సఖియ నే గూర్చుండి
కిన్నెరను మీటుచూ కీర్తనను బాడగా!
ముద్దుగోపాలుడే మురళి చే ధరియించి!
అలరి నృత్యముజేసె ననిపించు నా యెదుట!

బొట్టు గాటుకలనూ పొలుపుగా దిద్దుకొని
అద్దమున నా రూపు నలరి జూచేవేళ!
బుగ్గచుక్కను వెట్టి పొలుపుగా నవ్వుచును
మాధవుమై నటులుగా మది దోచునే చెలీ!

నవ్వినటు పాడినటు నాట్యాలు జేసినటు
మురళి నూదీ నన్ను మోహమున ముంచినటు!
కనికరించీ మదిని కలవరము దీర్చినటు!
శీర్షమున కరముంచి చిరకాంక్ష దీర్చినటు

నా నీడ జూచుకొని నాతి! భ్రమ లొందుదును!
నందగోపాలుడే నా వెనుక వచ్చెనని!

## అణువణువున

అణువణువున నిన్ను గలియ
ఆరాటము జిన్నికృష్ణ!
　　గిరులు దరులు బాలతలకు
　　సిరులొలికెడు నీరధులకు!
అణువణువున నిన్ను గలియ
ఆరాటము జిన్నికృష్ణ!

అలలు తెరలు సంద్రములో
ఆటు పోటు సాంద్రగీతి!
నిను బాడుట యెందులకో!
నిలిచి పిలుచు టెందులకో!

మస్తకముల నెత్తి గిరులు
మది మ్రొక్కుట యెందులకో!
తరులు లతలు చివురులతో
తల లొంచుట యెందులకో!

జాబిలి వెన్నెల రేకలు
జారి యిసుక తిన్నెలపై!
పొదలమాటు క్రీనీడల
పొగులుట యెందులకో మఱి?

నిను జూడగ నిను బొందగ
నీరజాక్ష! కాంక్ష యేమొ!
మోహములో విశ్వమంత
మునిగితేలు చున్నదోయి!

## అందమైన

అందమైన యా సుందర ఋతువులు
రమ్మని పిలిచెను రా! రా! రమ్మని!
నీ మురళీ స్వనములలో మునిగిన
నే నెటు బోదును గోపాలా!
అంపమైన యా సుందర ఋతువులు
రమ్మని పిలచెను రా! రా! రమ్మని!

పిల్ల తెమ్మెరలు చల్లనిగాలులు
జల్లిన పుప్పొడి వనవీధులు నను!
తారలు పూచిన నీలాంబరమూ
తన్మయ మందగ రమ్మవి పిలిచెను!

జాబిలి రేకలు జల జలపారే
సెలయేటులలో జిలి బిలి తరగలు!
చిగురులు పూవులు చెట్ల నీడలూ!
సృష్టియందములు జేరవ రమ్మనె!

నీ మురళీ స్వనములతో విడివడి
నీ సుందర మాధుర్యము నోదిలీ!
ఇహ సుఖముల యా బంధములేలా?
పూర్ణ పురుష! నీ పొందు విడనోయి!

అందమైన యా సుందర ఋతువులు
రమ్మని పిలిచెను రా! రా! రమ్మని!

పి లు పు లు

## ఎన్ని జన్మలుగ

ఎన్ని జన్మలుగ ఎన్ని యుగాలుగ
వెంటనంట యిటు వేడుకటోయీ!

సన్నని మురళీ నాదము సేయుచు
తగని వ్యధలిడుట తగునా స్వామీ?

ఎన్ని జన్మలుగ ఎన్ని యుగాలుగ
వెంటనంట యిటు న్యాయమ స్వామీ?

ఎన్ని జన్మలిటు వేధించెదవూ?
కన్నెను గద నే గతములనుండీ
వెనుకనుండి నా కనులు మూసెదవు!
వేడుకరా! యిది గోపాలా!

కనుల నిలువవూ! కానిపింపవూ!
కనికరమున నను గారవింపవూ!
ముందు నిలచి నా మోదము దీర్పవు?
చిందవు నాపై చిన్ని చూపులను?

దూరపు కొండలు లోయలలోనీ!
తోరపు గోపుర శిఖరము లాగున!
కనిపించీ కనిపింపక నా మది
కలత నింపి విలపింప జేసెదవు!

తెరలెందుకు? నిటు గనుమఱుగెందుకు?
తీయని తేనెల తేటగీతికను!
కరము జాపితిని! కనికరింపుమా!
కాంతిరేఖలో నన్ను గలుపుమా!

## పేరడుగ బోకుమా!

పేరడుగ బోకుమా! పిలిచి నన్నొంటరిగ!
ఎవ్వరనుచును నన్ను కవ్వింప బోకూ!
నీ నీడలో నీడ! నీ వెలుగులో వెలుగు!
నేనుగాధా స్వామి! నిఖిలేశ! శ్రీకృష్ణ!
పేరడుగ బోకుమా! పిలిచి నన్నొంటరిగ
ఎవ్వరనుచూ నన్ను కవ్వింప బోకూ!

విభజించితివి మమ్ము వేఱువేఱుగ జేసి
దూరముగ మము జేసి దోషమున ముంచితివి!
కలలవలె మఱచితిని గతకాల వైభవము!
నీవె నేనను మాట నిక్కముగ మఱచితిని!

ఎవరనీ ప్రశ్నింప నెటుల నే వివరింతు?
మౌనముగ నేనుందు మాటమంతీ లేక!
నీ పరంజ్యోతినీ! నీ భాగస్వామినీ!
నీ దివ్యజ్యోతిలో నే నొక్క కిరణమును!

అఖిల జీవ సమూహ మంతయును నొక్కటని
అఖిలాత్మ లన్నియును నలరి నీవే యనీ!
ఆత్మలో నాత్మయని యనుభవమునకు వోచె!
నీ పేరే నా పేరు! నీవెవరవో నేను!

పేరడుగ బోకుమా! పిలిచి నన్నొంటరిగ!
ఎవ్వరనుచును నన్ను కవ్వింపబోకూ!

❋ సమాప్తం ❋

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారి
అనుమతి పొందినవి.

2268/తె 800/1484
1. నాలో వెలిగే దీపాలు (బాలసాహిత్యం) 0-50

2269/తె 800/1485
2. విజయ మంగళం (గీతములు) 4-00

2270/తె 800/1486
3. అందరికీ నచ్చిన కోడలు (నాటిక) 2-00

2909/తె 800/1892
4. ఉత్తర గో గ్రహణము (నాటిక) 2-00

3649/తె 700/35
5. శ్రీ కందుకూరి, శ్రీ సరోజినీదేవి(బుర్రకథలు)2-00

3756/తె 800/2444
6. ఆనంద మంగళం (లలిత గీతాలు) 4-00

3757/తె 800/2445
7. నాట్యశాల (నాటిక) 4-00

4560/800/3026
8. గోపబాలక శతకము (పద్యములు) 1-50

4561/800/3027
9. భూమితల్లి బిడ్డలు (నాటిక) 2-50

6622/తె 800/4551
10. పాలేటి తరగల్లో మల్లి (పాటలు) 5-00

6623/తె 800/4552

11. వీధి దీపం (కవితలు) 4-00

6624/తె 800/4553

12. వినయాంజలి (భక్తి వచనములు) 4-00

6936/తె 200/680

13. శ్రీరామచంద్ర సుధ (పాటలు) 4-00

7037/తె 800/4834

14. ఝాన్సీరాణి (బుర్రకథ) 2-50

7462/తె 800/5129

15. కృష్ణదాసి (లలిత గీతాలు) 4-00

8964/తె 800/5933

16. చిగురులు-పువ్వులు (లలితగీతాలు) 4.90

8965/తె 800/5934

17. పాలేటి తరగల్లో మల్లి (పాటలు) 5-00

8966/తె 800/5935

18. శోణ పద్మం (నాటిక) 3-00

8967/తె 800/5936

19. హరిదాసు (పాటలు) 2-00

8991/తె 800/5514

20. పూలరథం (గేయములు) 4-00

9698/తె 900/572

21. శ్రీ అల్లూరి (బుర్రకథ) 3-00

10035/తె 800/6768

22. ప్రతిధ్వనులు (వచన కవితలు) 4-00

1102-/తె 800/7349

23. గోదాదేవి పాటలు (లలితగీతాలు) 2-00

11679/తె 800/7794

24. గిరిజా కళ్యాణము (ద్విపద) 10-00

12686/తె 800/8429

25. ఎఱ్ఱన పోతనల కవితామాధుర్యము (తులనాత్మక పరిశీలన) 10-00

2717/తె 800/425

26. మౌన గీతాలు (లలిత గీతాలు) 5-00

13660/తె 800/9061

27. కన్నీటి పువ్వులు 8-00

13661/తె800/9062

28. శాంతిగీతం (ముత్యాల సరాలలో) 6-00

## నూతన ప్రచురణలు

29. మురళీ స్వనాలు (లలితగీతాలు) 8-00

30. మధుర గోపిక (లలితగీతాలు) 8-00

31. సుందరకాండము (గీతికలలో) 15-00

32. పిల్లనగోవి పిలుపులు (లలితగీతాలు) 10-00